# 1

పెద్దకొడుకు సంతోకుమార్‌ను ప్లీడరీ చదివించాడు. చిన్నకొడుకు సాధుకుమార్‌కు బి. ఏ. చెప్పించాడు. చిన్నపిల్ల పంకజ వివాహంకోసం అయిదు వేలరూపాయల రొఖ్ఖం భార్యకు వప్పగించాడు. ఇదంతాచేసి తానిక జీవితబాధ్యతలనుండి విముక్తి పొందాననుకున్నాడు దేవకుమార్. ఇక తన జీవిత శేషాన్నంతా భగవధ్యానంలో గడుపవచ్చుననుకున్నాడు. ఆయన తన ఆస్తినంతా భోగవిలాసాలకూ, సాహిత్యసేవకూ కొల్లబెట్టేశాడని యిప్పుడెవరైనా ఆయన్ను ఆక్షేపణచేస్తే చెయ్యొచ్చు కాని, ఆయన హృదయం చాలా విశాలమైనదన్న సత్యాన్ని కాదనగలవాళ్ళెవరూ లేరు. ఆయన సాయంకోరి లేదనిపించుకున్నవాళ్ళెవరూ ఉండరు. ఆయన తన యౌవ్వన కాలమంతా భోగవిలాసాల నిషాలోనే గడిపాడు. ఇక జీవితమంతా అప్పటి నష్టాన్ని భర్తీచేసుకొనే ప్రయత్నంలోనే గడుపుతూ వచ్చాడు. కాని సాహిత్యసేవ మినహా యింకే విషయంలోనూ ఆయనకు ఆసక్తికలిగేదేకాదు. ఇక అందులో ధనానికి స్థానమెక్కడుంది ?– నిజమే! కీర్తివరించిం దాయనను. అదే ఆయన ఆత్మకు తృప్తికలిగించేది. ధనం గడించటంలో ఆయనకు నమ్మకంలేదు. పరిస్థితులా నమ్మకాన్ని మరింత బల

పరిచి యుండవచ్చు. కాని 'ధనం సంపాదించలేకపోతినే' అన్న బెంగ ఆయన కెప్పుడూ కలిగేదే కాదు. పరువుగా తనకాలం గడిచిపోతుంటే అంతేచాలు! అంతకంటే అధికంగా ఆశించే వాడే కా దాయన. సాహిత్యరసికుల్లో ఉండే మిడిసిపాటు — పోనీ బడాయనే అనుకోండి — అది ఆయనలోనూ ఉండేది. ఆయన తమ ఆస్థానానికి రావాలనీ, తన రచనలను వినిపించాలనీ, ఆయనకు బహుమానా లివ్వాలనీ కోరుకునే శ్రీమంతులూ, మహారాజాలూ ఎందరుండేవాళ్ళు! కాని దేవకుమార్ తన ఆత్మగౌరవాన్ని ఎన్నడూ జారవిడుచుకోలేదు. ఎవరైనా ఆహ్వానించినా కృతజ్ఞత ప్రకటించి తప్పించుకునేవాడు. తప్పించుకోటమే కాదు; శ్రీమంతులూ, మహారాజాలూ తన యింటికే వచ్చి తనను కీర్తించాలని ఆశపడేవాడు. అది జరిగే విషయమేనా? తనతోపాటు చదువుకున్న మందబుద్ధులనేకమంది ప్లీడరీవృత్తిద్వారానో, తదితర వృత్తులద్వారానో ధనరాసులు కూడబెట్టటం, ఆస్తులుకొనటం, కొత్త కొత్త భవనాలు కట్టించటం, యివన్నీ చూచి అప్పుడప్పుడు అమితంగా విచారపడేవాడు. ముఖ్యంగా తన భార్య శైవ్యా గృహసంబంధమైన చిక్కులతో విసుగెత్తి ఆయనను పరుషంగా మాట్లాడే సమయంలో ఆయన తనస్థితికి మరింత బాధపడేవాడు. కాని తన రచనాకుటీరంలో కలంపట్టి కూర్చొనగానే సమస్తం విస్మరించి సాహిత్యస్వర్గానికి చేరుకునేవాడు. ఆత్మగౌరవం జాగృతమయేది. అలసట, విషాదం అదృశ్యమయ్యేవి.

కాని కొన్నాళ్ళనుండి సాహిత్య రచనలో ఆయనకు అభిరుచి మందగిస్తూ వచ్చింది. సాహిత్యప్రియులకు తన పట్ల

ఆ తొలిరోజుల్లో గల భక్తిశ్రద్ధలు లేవనిపించసాగిం దాయనకు. ఆయన యిటీవల చాలా కష్టపడి రెండు పుస్తకాలు వ్రాశాడు. ఆయన తన సమస్త జీవితానుభవంతోనూ, కళాప్రతిభతోనూ పరిపూర్ణంచేశాడా రెండు గ్రంథాలనూ. కాని వాటికి ప్రత్యేక ఆదరణేమీ ప్రాప్తించలేదు. ఇంతకుపూర్వం వెలువడిన ఆయన రచనలు సాహిత్య ప్రపంచంలో కలకలాన్ని రేకెత్తించాయ్. ప్రతి పత్రికలోనూ ఆ పుస్తకాలను గురించి సుదీర్ఘమైన విమర్శలు వెలువడ్డాయి. సాహిత్య సంస్థలు ధన్యవాదాలర్పించాయి. సాహిత్యవేత్తలు ప్రశంసిస్తూ లేఖలు వ్రాశారు. దేవకుమార్ దృష్టికిప్పుడా రచనలు అంత ఆదరణీయంగా లేకపోయినా, వాటిలోని భావాలు భావావేశదోషంతో నిండి ఉన్నాయనిపిస్తున్నా, శైలికూడా కృత్రిమంగానూ, జటిలంగానూ ఉన్నప్పటికీ, ప్రజాదృష్టికి ఆ రచనలే యిప్పటికీ ఆప్యాయంగా ఉన్నాయి. కాని ఈ క్రొత్తకృతులు ఆహ్వానించబడని అతిథిలాగా ఆదరణ పొందాయి. సాహిత్య ప్రపంచమంతా ఏకమై తనను చిన్నచూపు చూస్తున్నారా అనిపించింది దేవకుమార్‌కు. అసలంతకు మునుపే ఆయన విశ్రాంతిగా తన కాలం గడపాలనుకునేవాడు. ఈ నిరాదరణ ఆ అభిప్రాయాన్ని మరింత గట్టిపరిచింది. "ఆకలి అమితంగా ఉన్నప్పుడు మామూలు భోజనంకూడా ఎంతో మధురంగా ఉంటుంది. కాని ఆకలి మందగించగానే ఎంత మధురపదార్థమైనా అంత ఆప్యాయంగా ఉండదు". ఈ తర్కంతో ఆయన సన్నిహిత కవిమిత్రు లొకరిద్దరు ఆయన్ను ఓదార్చటానికి ప్రయత్నించారు. కాని అందువల్ల ఆయన కేమీ మనశ్శాంతి కలుగ

లేదు. ఆయన దృష్టిలో సజీవమైన రచయిత ఎవరూ. అంటే అందుకొకటే ప్రమాణం, ఆ రచయిత రచనలం టేగల దాహం నిరంతరం పెంపొందాలి. అలాంటి దాహం లేదని తెలిసప్పుడు ఆ రచయిత యిక రంగంనుండి విరమించాలి. ఆయనకు మిగిలిందల్లా కుమార్తె పంకజ వివాహసమస్యే. పుస్తక ప్రకాశకుడొకడు ఆయన తాలూకు లోగడ వ్రాసిన రెండు కృతులకూ అయిదు వేలిచ్చాడు. ఆయన దాన్ని భగవత్ప్రేరణగా భావించి తన కలాన్ని శాశ్వతంగా మూలపెట్టేశాడు. తాను వానప్రస్థాశ్రమం స్వీకరించాడు. ఐనా తాను బంధనాలనుండి విముక్తి కాలేదన్న విషయం ఈ ఆరు నెలల్లో ఆయనకు అనేకసార్లు అనుభవమైంది. తన భార్య శైవ్యా మొండితనాన్ని గురించికూడా ఆయన కంతగా లక్ష్యమేమీ లేదు. సంసారాన్నే సమస్తంగా భావించే సాధ్వీమణులకోవకు చెందిందామె. తన కుటుంబంమీద పెత్తనం చెయ్యాలనే కాంక్ష ఆమె నిప్పటికీ వదలలేదు. కాని చేతుల్లో పైసా లేనప్పుడు ఆమె కాంక్ష నెరవేరే దెలా ? దేవకుమార్ తననల్లైబై సంవత్సరాల వైవాహిక జీవితంలోనూ శాంతపరచ లేకపోయినా డామె కాంక్షను ఇక ఆ కోర్కెను యిప్పుడు సంతృప్తిపరచటానికి ప్రయత్నించటమంటే నీళ్లమూటగట్టాలనుకునే వ్యర్థప్రయత్నం కాదూ! అంతే అనుకున్నాడు దేవకుమార్. ఆయన విచారపడేదల్లా సంత్ కుమార్ అభిప్రాయాలకూ, ప్రవర్తనకూ మాత్రమే. ఆ స్త్రీపాత్రలన్నీ కొల్లబెట్టిన నేరానికి తన నిస్థితిలోకూడా క్షమించటాని కిష్టపడటం లేదు సంత్ కుమార్. ఏభైసంవత్సరాల క్రితం పదివేల రూపాయలకు విసరిపారేసిన ఆ స్త్రీగనుక యిప్పు

డుంటే పదివేల సంవత్సరాలకు సరిపోయే ఆదాయం వచ్చేది. ఒకప్పుడు పట్టపగలే నక్కలు పొర్లాడే వారి భూమి ఈరోజున నగరంలో అన్నింటికంటే మించి కన్నులపండువుచేసే బజారుగా మారిపోయింది. అక్కడిభూ మిప్పుడు చదరపు అడుగు వంద రూపాయలకు అమ్ముడుపోతోంది. గొప్పవా డవాలని ఉవ్విళ్ళూరే సంత్ కుమార్ ఉండిఉండి లోలోపలే తన తండ్రి అంటే మండిపడుతున్నాడు. తండ్రి, కొడుకుల స్వభావంలో యింత అంతరం ఎలా వచ్చిందో అర్థంకాదు. దేవకుమార్ వద్ద ఎప్పుడూ అవసరాలకు సరిపడా డబ్బుండేదేకాదు. కాని ఆయన ఎప్పుడూ చాలా ఉదారంగానే ఉండేవాడు. సౌందర్య భావనతో జాగృతమైన ఆయన మనస్సు ఎప్పుడూ స్వర్ణోపాసనను తన జీవిత లక్ష్యంగా భావించలేకపోయింది. అంటే, దానర్థం ఆయనకు డబ్బువిలువ తెలియదనికాదు; కాని ఆయన మనస్సులో ఒక దృఢనిశ్చయం గూడుకట్టుకుంది. దేశంలో నాల్గింట మూడువంతుల జనం ఆకలితో అల్లాడిపోతూంటే, ఏ ఒక్కడో కోట్లు సంపాదించేందుకు - సంపాదించే సమర్థత ఉంటే ఉండుగాక - నైతికంగా మాత్రం అధికారంలేదు. కాని సంత్ కుమార్ ధనాశ యిలాంటి నైతికాదర్శాలను పరిహాసించేది. "సాహిత్యమంటే మీ కంత ప్రేమైనప్పుడు మీకు గృహస్థుడయ్యే అధికార మెక్కడిది? మీరు తమ జీవితాన్ని నాశనం చేసుకోటంతో పాటు మా బ్రతుకులుకూడా మట్టిలో గలిపారు. జీవితంలో మీ ఋణాలన్నీ తీరిపోయినాయా అన్నట్లుగా వానప్రస్థాశ్రమం స్వీకరించి కూర్చున్నారు." అప్పుడప్పుడు సంత్ కుమార్ వ్యంగ్యమాటంగా యింతవరకూగూడా అనేసేవాడు.

శీతాకాలపు రోజులవి. ఎనిమిదిగంటలైంది. ఇంట్లో వాళ్ళంతా ఫలహారానికి గుమిగూడారు. పంకజ మేజామీద తేనీరు, కమాలాపండ్లు, ఎండుఖర్జూరాలు ప్లేట్లలో పెట్టి,సోదరులిద్దరినీ పిలవటానికి వాళ్ళ గదుల్లోకి వెళ్ళింది. ఒక నిమిషంలో సాధుకుమార్ వచ్చి కూర్చున్నాడు. పొడుగ్గా, బలంగా ఉంటాడు. తెల్లగా, అందంగా ఉంటాడు. మధురభాషి. శాంత స్వభావంగల యువకుడు. హాయిగాభోంచెయ్యటం, కులాసాగా షికారు కెళ్ళటం ఇదే కార్యక్రమం మతనికి. ఏ రికిం దేదో కడుపునిండా తిని మిత్రులతో కలిసి వెళ్ళిపోయేవాడు.

"సంతూ ఎక్కడున్నాడమ్మా ! టీ చల్లారిపోయిందం ట; పట్టి నీళ్ళంటాడుమళ్ళీ ! పిలుచుకురా సాధూ ! వాడికి తిండికి కూడా తీరిక దొరకటం లేదూ ?" అన్నది శైవ్యా.

సాధు తలవంచు కూరుకున్నాడు. సంత్ కుమార్ తో మాట్లాడేటప్పుడు అతని గుండెలు దడదడలాడుతుండేవి.

"వాణ్ణికూడా పిలుచుకురావేంరా ?" శైవ్యా ఒక క్షణమాగి మళ్ళీ అన్నది.

"ఉహూఁ ! ఎగిరిపడతాడు ప్రొద్దున్నే. ఇక నా రోజంతా పాడుపాడవుతుంది" క్షీణస్వరంతో అన్నాడుసాధూ.

ఇంతలో సంత్ కుమార్ వచ్చేశాడు.చూపులకు తమ్ముడి మాదిరిగానే ఉంటాడు. శరీర సౌష్ఠవం మాత్రం అంత బాగుండదు. ఆఁ ! ముఖంలోమాత్రం తేజస్సూ, అహం భావం తొణికిసలాడుతుంటాయి. ప్రపంచంలో ఏదీ అతనికి

నచ్చటం లేదన్న భావం అతని ముఖంలో స్పష్టంగా వ్యక్త మౌతూంది.

"నీవు రావేం పంకజా! పుష్ప ఎక్కడుంది? ఫల హారాలూ, భోజనాలూ, అన్నీ ఒకేసారి పూర్తికావాలని ఇప్పటి కెన్నిసార్లు చెప్పాను నేనూ!" బల్లమీద కూర్చుని టీ నోటి కందిస్తూ, ముఖం చిట్లిస్తూ అన్నాడు సంతోష్ కుమార్.

"మీరు తినండి. వాళ్ళంతా తరువాత తింటారులే. అందరూ ఒక్కసారి కూర్చోటాని కిదేమీ విందు కాదుగా?" కళ్ళు కుముతూ అన్నది శైవ్యా.

"అల్లదే తాతలనాటి చట్టం. ఎన్ని మార్లు చెప్పను, యిది సిగ్గులకూ, బిడియాలకూ కాలంకాదనీ!" సంతోష్ కుమార్ ఒక గుక్కెడు టీ త్రాగి అన్నాడు.

"అందరూ ఒక్కసారి కూర్చుంటే వండే దెవరూ; వడ్డించే దెవరూ? వండటాని కో వంటవాణ్ణీ, వడ్డించటాని కింకొకణ్ణీ ఏర్పాటుచెయ్యి. అప్పుడైతే సాగుతుంది దర్జా!" అన్నది శైవ్యా కోపంతో.

"ఐతే ఆ ఏర్పాటేదో ఆ మహానుభావుడు చెయ్య కూడదూ? ఆయనకు చేతనైంది వానప్రస్థాశ్రమం పుచ్చుకోట మేనా?"

"ఆయన చెయ్యాల్సిందేదో ఆయన చేశారు. ఇక నీవు చెయ్యాల్సిందేదో చెయ్యాల్సి."

" ఆ పౌరుషం లేనప్పుడు మమ్మల్ని చదివించట మెందుకేం? ఏ పల్లెటూరులోనన్నా పడవెయ్యక పోయినారూ?

మేము మా వ్యవసాయం చేసుకునో, కూలిచేసుకునో పడుండే వాళ్ళం ! ఈ జంఝాటాన్నంతా ఎందుకు పెంచారూ ?"

"అప్పుడు నువ్వు లేవుమరి; సలహా ఎవరినడుగుతారూ!"

సంత్ కుమార్ మూతి ముడుచుకుని టీ త్రాగాడు. కాసిని ఖర్జూరపు పండ్లు తిన్నాడు. తరువాత సాధుకుమార్‌తో అన్నాడు— "మీ టీము బొంబాయి వెళ్లే దెప్పుడేంరా ?"

"ఎల్లుండే" తలవంచుకుని జంకుతూ అన్నాడు సాధు కుమార్.

"మరి నువ్వు కొత్తసూటు కుట్టించుకున్నావా ?"

"నా పాతసూటు యింకా బాగానే ఉందిలే."

"సూటు లేకపోతే మాత్రం బాగుండదూ ? మేము దిస కాళ్లతో ధోవతి కట్టుకుని ఆడేవాళ్ళం. కాని ఒక అఖిలభారత జట్టులో ఆడబోతున్నప్పుడు దానికి తగిన దర్జాకూడా ఉండాలి. ఈ స్థితిలో నెళ్ళేకంటే మా నెయ్యటమే మంచిది. అక్కడ ప్రజలు నీవు దేవకుమార్ మహాశయుని సుపుత్రుడవని తెలిస్తే ఏమనుకుంటారూ ?"

సాధుకుమారేమీ బదులు చెప్పలేదు. మౌనంగుండా ఫలహారంచేసి వెళ్ళిపోయాడు. అతనికి తన తండ్రి ఆస్తి పరిస్థితులు బాగా తెలుసు. ఆయన్ను యిబ్బందిపెట్టటం యిష్టం లేదతనికి. సంత్ కుమార్‌కు కొత్త సూటు అవసరమనిపిస్తే కుట్టించరాదూ ? నాన్నగారిమీద మరింత బరువెత్తేమంటూ వత్తిడి చేస్తాడు దేనికీ ?

సాధూ వెళ్ళిపోగానే శైవ్యా ఎంతో నొచ్చుకుంటూ అన్నది—"నాకిక యింటివ్యవహారాలతో ఏవిధమైన సంబంధం లేదనీ, సర్వం మీాకే అప్పగించాననీ ఆయన స్పష్టంగా చెప్పారు గదా! సంసారభారం యింకా ఆయన నెత్తికెత్తటం ఎందుకు చెప్పూ? తన సామర్థ్యం, తెలివితేటల ననుసరించి తనకు చేతైనట్లుగా తన రోజులు వెళ్ళబుచ్చుకున్నారు. ఆయన చెయ్యలేని పనులకూ, చేసిన పొరబాట్లకూ ఆయన్ను ఊరికే యెత్తిపొడవటం నీ కేమంత ఘనంగాదు. ఈ విధంగా నువ్వా యన్ను వేధించావంటే ఆయన యిల్లు విడిచి, కళ్ళబడకుండా ఎటైనా వెళ్ళిపోతారేమోనని భయంగాఉంది నాకు. ఆయన మళ్లై సంపాదించనిమాట నిజమే. కాని ఆయన ఎక్కడికైనా వెళ్ళనీ!—ప్రజలు ఆయన్ను నెత్తినబెట్టుకు పూజిస్తారన్న విషయం నీకూ తెలుసు."

శైవ్యా యింతవరకూ ఎప్పుడూ భర్తను ఈసడింపుగానే చూస్తూవచ్చింది. ఇవ్వాళ ఆమె తన భర్త తరఫున వాదించటం చూసి సంత్‌కుమార్ చిరునవ్వు నవ్వుకున్నాడు.

"ఆయన కటువంటి అభిప్రాయముంటే ఆయనకంటే ముందు నేనే వెళ్ళిపోతాను. నే నీభారం నా నెత్తికెత్తుకోలేను. ఈసంసారాన్ని ఈదటంలో ఆయన నాకు అండగా ఉండితీరాలి. ఆయన తాను సంపాదించినఆస్తయితే కొల్లబెట్టుకునేహక్కుంది. కాని తాతముత్తాల ఆస్తిని తగలబెట్టటానికి ఆయన కేమీా అధికారం లేదు. ఇందు కాయన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. ఆ ఆస్తి మాకు తిరిగి అప్పగించితీరాలి. నాకూ శాస్త్ర "లా"

తెలుసు. ప్లీడర్లతోనూ, మేజిస్ట్రేట్లతోనూ సంప్రతించాను. ఆస్తి తిరిగి సాధించటాని కవకాశముంది. ఆయనకు తన సంతాన మెక్కువో, మహాత్మాగిరి ఎక్కువో ఏదో తేలిపోవా లిప్పుడు !"

ఈ మాటలంటూ, సంత్ కుమార్ పంకజ యిచ్చిన తమలపాకులు తీసుకుని తన గదికి వెళ్ళిపోయాడు.

# 2

సంత్‌కుమార్ భార్య పుష్ప నిజంగా పుష్పంవంటిది. రూపవతి. సుకుమారవతి. సన్నగా ఉంటుంది. ఎంతో ఆత్మాభిమాని. ఒక్కొక్క విషయానికి ఆమె అనేకరోజులు కోపంగా ఉండగలదు. ఆమె కోపంకూడా అన్నివిధాలా విచిత్రమైంది. ఆమె ఎవరితోనూ మాట్లాడదు. పోట్లాడదు. చిరాకుపడదు. కాని యింటిపనులన్నీ యథాప్రకారంగానే చేస్తుంటుంది. మరింత శ్రద్ధగాకూడా చేస్తుందేమో! తనకు కోపం కలిగించిన వాళ్ళవైపుకూడా చూడదు. కాని వాళ్లు చెప్పిందల్లా చేస్తుంది. వాళ్ళు అడిగినదానికల్లా జవాబిస్తుంది. వాళ్ళు కావాలన్నదల్లా అందిస్తుంది. కాని యిదంతా వాళ్ళ ముఖంవంకనైనా చూడకుండానే చేస్తుంటుంది. ఈ మధ్య చాలారోజులుగా ఆమెకు సంత్‌కుమార్‌పైన కోపంగా ఉంది. తన అలకచూపులతో అతని దాడులన్నిటినీ ఎదుర్కొంటూంది.

సంత్‌కుమార్ స్నేహపూర్వకంగా అన్నాడు — "యివ్వాళ సాయంత్రం వెళ్లాలికదూ?"

"అదంతా మీయిష్టం" తలవంచుకుని అన్నది పుష్ప.

"వస్తావా మరి!"

"మీరు రమ్మంటే ఎందుకురానూ!"

"నీ అభిప్రాయమేమిటంటావ్ ?"

"నా కే అభిప్రాయమూ లేదు."

"ఇంతకూ దేని కింత కోపం నీకూ!"

"దేనికీ లేదు."

"మంచిది! చెప్పబోకులే. కాని ఆ విషయం గురించి మూగనోముపట్టినంత మాత్రాన పరిష్కారం కాదు."

పుష్ప ప్రయోగించిన ఈ సాధారణ అస్త్రమే సంతోషకుమార్‌కు పిచ్చియెత్తించింది. అతను బాగా వాదించి ఆ వివాదాన్ని చల్లబరుద్దామనుకున్నాడు. అటువంటిమాట మళ్ళీ ఎప్పుడూ అనననీ క్షమాపణ కోరుకోటానికికూడా సిద్ధపడ్డాడు. కాని నిజానికతనన్నమాట ఆమెను రెచ్చగొట్టడానికి కానే కాదు. ఒక వాస్తవిక విషయాన్ని బలపరచటానికి మాత్రమే అన్నాడు. ఆయన అన్న మాటిదీ: పురుషునిమీద ఆధారపడ్డ స్త్రీ పురుషుని అధికారానికి తలవంచక తప్పదు. ఆసందర్భంలో అలా అనకుండా ఉంటే బాగుండేదని అతనూ అంగీకరిస్తాడు. ఒకవేళ అలా అనటం అవసరమనుకున్నప్పటికీ సున్నితమైన మాటల్లో అనవలసింది. కాని ఒక విషయం. ఏ స్త్రీయైనాసరే తన హక్కులకోసం పురుషునితో ఘర్షణ పడదలచుకున్నా, పురుషునితో స్త్రీకి సమానహక్కులున్నాయని వాదించదలుచుకున్నా పరుషమైనమాటలు పడడానికికూడా సిద్ధంగా ఉండాలి. ఇప్పుడతను వచ్చిందికూడా పుష్పను సిరుత్సాహంగా చేద్దామనే; ఎడమొగం పెడమొగంగా ఉన్నంతమాత్రానే ఏ

విషయం తేలదని నచ్చచెప్పడానికే. ఆ సమస్యమీద తిరిగి ఎప్పుడూ వివాదం చెలరేగటానికి అవకాశం లేకుండా తానీ క్షేత్రాన్ని జయించాలనీ, అక్కడొక విజయస్తంభం నెల కొల్పాలనీ అతని కోరిక. అప్పటినుండీ అతని మనస్సులో ఎన్నెన్ని కొత్త కొత్త తర్కాలు పుట్టుకొచ్చాయి! కానేం లాభం? శత్రు వసలు కోటదాటి బయటకు రావటం అంటూ జరిగితేగా, వాడిమీద దండయాత్ర చెయ్యటానికి!

ఐతే ఒక్క ఉపాయముంది. శత్రువును లాలించి అతనికి తన మైత్రీభావంపైనా, ప్రేమస్వభావంపైనా విశ్వాసం కలి గించి, కోటనుండి బయటకు రప్పించాలి.

సంత్ కుమార్ పుష్ప గడ్డంపట్టుకుని తనవైపుకు త్రిప్పు కుని అన్నాడు— "నే నన్న మాట నీ కింత కష్టంగాఉంటే నే నా మాట నుపసంహరించుకుంటాను. అలా అన్నందుకు క్షమా పణ కోరతాను. నువ్వు నాతో పది, పదిహేను రోజులైనా మాట్లాడకుండా ఉండగలవు. భగవంతుడు నీ కా శక్తినిచ్చాడు. కాని ఆ శక్తి నాకుమాత్రం యివ్వలేదు. నీవు అలిగావంటే నా నాళాల్లో రక్తప్రవాహం స్తంభించిపోయిందనిపిస్తుంది. నాకు కూడా నువ్వు ఆ శక్తి ప్రసాదించగలిగితే అప్పుడది సమానుల మధ్య యుద్ధమౌతుంది. అప్పుడు నిన్ను రెచ్చగొట్టటానికే రాను నేను. నీ కలా చెయ్యటానికి శక్తిలేకపోతే, ఆ అస్త్రం నామీదమాత్రం ప్రయోగించబోకు!"

పుష్ప చిరునవ్వు నవ్వింది. ఆమె తన అస్త్రంతో పతిని పరాజితుణ్ణి చేసింది. అత నంత దీనుడై క్షమాపణ వేడుకుంటు న్నప్పుడు ఆమె మనసు కరగటంలో ఆశ్చర్యమేముంది!

సంధిపత్రంమీద సంతకమూ అన్నట్లుగా తమలపాకు బీడా చుట్టి సంత్ కుమార్ కు అందిస్తూ అన్నది - "ఇక ముందెప్పుడూ అలాంటి మాట లనకుగదూ! నేను మీమీద ఆధారపడ్డదాన్నయితే మీరు నామీద ఆధారపడ్డవాళ్ళే. నేను మీ యింట్లో చేస్తున్నంత చాకిరీ యితరు లిండ్లల్లో చేస్తే నన్ను నేను పోషించుకోగలనంటారా? లేదంటారా? చెప్పండి!"

"హాయిగానూ" కఠినమైన జవాబిద్దామనే తన కోరికను అణచుకుని అన్నాడు సంత్ కుమార్.

"అప్పుడు నేను సంపాదించినదంతా నాదౌతుంది. ఇక్కడ నేను ప్రేగులు త్రెంచుకోనీగాక, నా కే వస్తువుమీదా అధికారం లేదు. మీ యిష్టమొచ్చినప్పుడు నన్ను ఇంటినుంచి గెంటివెయ్యగలరు."

"సరే కానీ! దానికి జవాబు వింటానికన్నా సిద్ధంగా ఉండాలినుమా!"

"మీ రేమీ చెప్పలేరు జవాబు. మీ కున్నదల్లా మొండిపట్టుదలొక్కటే. మీరనేది యిదేగా! 'నీ కిక్కడున్న గౌరవం అక్కడ ఉండదు; అక్కడ నిన్ను కాపాడేవాళ్ళెవరూ ఉండరు. నీ కష్టసుఖాల్లో భాగం పంచుకునేవాళ్ళెవరూ ఉండరు!' ఇలాంటివే యింకెన్నో వాదనలు చెయ్యగలరు మీరు. కాని మిస్ బట్లర్ జీవితపర్యంతం అవివాహితంగా ఉండి, గౌరవంగా జీవితం గడపటం నే నెరుగుదును. ఆమె వ్యక్తిగత జీవితం ఎలాంటిదో నాకు తెలియదు. హిందూ గృహిణుల ఆదర్శానికి అనుగుణంగా లేకపోవచ్చును. కాని ఆమెను అందరూ గౌరవించేవాళ్ళు. మరి ఆమె కెప్పుడూ తన రక్షణ

కోసం ఎవరో ఒక పురుషుణ్ణి ఆశ్రయించవలసిన అవసరం కలగలేదు."

సంత్ కుమార్ కు బట్లరుతో పరిచయముంది. ఆమె నగరంలో ప్రసిద్ధ లేడీడాక్టరు. పుష్ప కుటుంబంతో ఆమెకు సన్నిహిత పరిచయముంది. పుష్ప తండ్రి డాక్టరు. ఒకేవృత్తిలో ఉన్న వారిమధ్య సన్నిహిత సంబంధం ఏర్పడటం సహజమే. పుష్ప అతని ముందుంచిన సమస్యను గురించి తటస్థమైన ధోరణిలో తన అభిప్రాయం కొంత వ్యక్తంచెయ్యటం కఠినమై పోయింది సంత్ కుమార్ కు. పోనీ మౌనంగా ఉందామనుకుంటే అతని పురుషత్వాని కది మరింత దుర్భరమైపోయింది.

సందిగ్ధంలోపడి అన్నాడు— "స్త్రీలందరూ మిస్ బట్లరులు కాలేరుగదూ ?"

"ఎందుకనేం ? ఆమె వైద్యపరీక్ష చదివి తన వృత్తి చేసుకోగలిగినప్పుడు, నాకెందుకు చేతగాదూ ?" ఆవేశంతో అన్నది పుష్ప.

"వాళ్ళ సొసైటీకి, మన సొసైటీకి బోలెడంత అంతర ముంది."

"అంటే వాళ్ళ సమాజంలో పురుషులు శిష్టులూ, శీల వంతులూ నన్నమాట. మన సమాజంలోని పురుషులు ముఖ్యంగా విద్యావంతులైనవాళ్ళు పతితులూ, అవినీతిపరులూ నన్నమాట."

"ఆ సమాజంలోని స్త్రీలకు ఆత్మవిశ్వాసం, ఆత్మరక్షణ సామర్థ్యం, పురుషులను స్వాధీనం చేసుకోగల నిపుణత యివన్నీ ఉన్నాయన్న విషయంకూడా చెప్పలేం ?"

"ఆ ఆత్మబలం, సామర్థ్యం, నైపుణ్యం, అవన్నీ మేమూ సంపాదించాలనే కోరుకుంటున్నాం. కాని మీరు కొంచెమైనా సాగనిస్తేనా? ప్రతిష్టనీ, ఆదర్శమనీ – ఒక టే మిటి! ఎన్నెన్ని సాకులతో మమ్మల్ని అణగద్రొక్కేందుకూ, మామీద తమ అధికారాన్ని నిలబెట్టుకునేందుకూ కృషి చేస్తూంటారూ!"

చర్చ మళ్ళీ పుష్పకు కోపంకలిగించే ధోరణిలోనే సాగు తుండటం కనిపెట్టాడు సంత్ కుమార్! మరి యిప్పు డతను వచ్చింది ఆమెను సంతోషపెట్టడానికిగాని కోపం తెప్పించ టానికి కాదుగా!

"ఔనులెండి! సమస్త దోషాలూ పురుషులవే లే. ఇక రాజీపడదాం. పురుషుడుకూడా అధికారం చలాయించి చలాయించి అలిసిపోయినాడు. ఇక కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నాడు. నీ అధీనంలో ఉండి ఈ సంఘర్షణ నుంచి బయటపడగలిగితే సింహాసన పరిత్యాగం చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాడు."

"సరే! అయితే; ఈరోజునుంచి యింట్లోనే కూర్చోండి" చిరునవ్వు నవ్వుతూ అన్నది పుష్ప.

"సంతోషంగా కూర్చుంటా. నాకు కావలసినవన్నీ తెచ్చిపెడుతూ ఉండు. నువ్వు చెప్పినట్లే చేస్తా. నీ కిష్టం కాని మాట ఒక్కటికూడా మాట్లాడను."

"స్త్రీ పురుషుడి బానిసనీ, అందువల్ల ఆమె పురుషుడికి దాస్యం చెయ్యాలనీ, మళ్ళీ ఎప్పుడూ అనరుగదూ?"

"ఎప్పుడూ అనను, ఐతే ఒక్కమరతుంది."

. "ఏమిటో అది ?"

"నిన్ను ప్రేమించే అధికారం నాదే."

"ఇటువంటి మరతుకు స్త్రీలు పురుషుణ్ణి ఏనాడు ఒప్పించ గలిగారు ?"

"అది వాళ్ళ బలహీనత. కాని భగవంతుడు మట్టుకు స్త్రీలకు పురుషులను శాసించే సమస్త ఆయుధాలూ ప్రసాదించాడు."

రాజీ కుదిరినప్పటికీ పుష్ప మనసు కుదుటపడలేదు. సంత్ కుమార్ స్వభావం ఆమెకు బాగా తెలుసు. స్త్రీమీద పెత్తనం చేయటానికి అలవాటుపడిన ఒక మానసిక సంస్కారం యింతత్వరలో ఎలా మారగల్గుతుంది ? పైపై మాటల్లో మాత్రం సంత్ కుమార్ ఆమెకు తనతో సమానహోదా నిచ్చే వాడు. కాని అందులో ఒక రకమైన దాక్షిణ్యం దాగిఉండేది. ముఖ్యమైన విషయాల్లో కళ్ళెం తన చేతుల్లోనే ఉంచుకునే వాడు. అంటువంటి వ్యక్తి అకస్మాత్తుగా తన అధికారాన్ని త్యాగం చెయ్యటానికి సిద్ధపడ్డాడంటే యిందులో ఏదో రహస్య ముండి తీరాలి.

"స్త్రీలు ఆ అస్త్రాలతో తమ ఆత్మరక్షణ చేసుకోలేదు. పురుషులనే కాపాడుతూ వచ్చారు. అసలు స్త్రీలకు తమను రక్షించుకోగల శక్తి, సామర్థ్యా లెక్కడివి?" అన్నది పుష్ప.

"ఇదే అభిప్రాయం నా కెన్నోసార్లు కలిగింది పుష్పా ! అంతేకాదు. స్త్రీయేగనుక పురుషుణ్ణి కాపాడి వుండకపోతే, యివ్వాళ ప్రపంచమే ఎడారిగా ఉండేది. ఆమె జీవితమంతా త్యాగమయం !"

తరువాత సంత్ కుమార్ తన అభిమతం వెల్లడించాడు. తన తాతలనాటి ఆస్తిని కాజేసిన మహానుభావులనుండి ఆ ఆస్తిని తిరిగి రాబట్టుకోవాలనుంది అతనికి. పుష్ప గనుక తన తండ్రి కిదంతా నచ్చచెప్పి పదివేలరూపాయల డబ్బు యిప్పించి నట్లయితే, సంతకుమార్ కు రెండు లక్షల రూపాయల ఆస్తి దక్కటాని కవకాశముంది. ఒక్క పదివేలైతే చాలు. ఆ మాత్ర మైనా లేకపోతే రెండు లక్షల రూపాయల ఆస్తీ చెయ్యిజారి పోతుంది. "కాని ఆ ఆస్తి అమ్మకమైపోయిందిగా" అన్నది పుష్ప.

సంత్ కుమార్ తలపంకించాడు —"అమ్మకం కాదది; దోపిడీ! లక్షా రెండు లక్షల కమ్మినా చౌకనిపించే భూమి పది వేల రూపాయలకు నాశనమైపోయింది. తెలివిగలవాడెవ్వడూ యింత గోతిలోపడడు. ఒకవేళ పడినా స్పృహాలో ఉండగా పడడు. గృహ నిర్వాహణలో మా నాన్నగారంత సమర్థుడు కాదు. ఆయన ఊహాప్రపంచంలో విహరించేవాడు. దుష్టు లాయనకు టోపీవేసి ఆస్తి కాస్తా భుక్తంచేసుకున్నారు. ఆ ఆస్తిని తిరిగి స్వాధీనం చేసుకోటం నా కర్తవ్యం. నీవు పూనుకుంటే అంతా జరిగిపోతుంది. డాక్టరుగారికి పదివేల రూపాయలు సర్దుకోటమంటే ఏమంత బ్రహ్మాండం కాదు.

పుష్ప ఒక్క క్షణంసేపు ఆలోచనలో మునిగింది. తరు వాత అనుమానంగా అన్నది — "మా నాన్నగారిదగ్గర అంత పైకం నిలవవుంటుందన్న ఆశ నాకేమాత్రం లేదు."

"కాస్త చెప్పి చూడు."

"చెప్పటం ఎలా చెప్పండి! వారి పరిస్థితి నాకు తెలియదు గనకనా ? ఆయన ప్రాక్టీస్ బాగా సాగుతున్నమాట నిజమే. కాని దానికి తగిన ఖర్చుకూడా వుంది. బీరూకు ప్రతినెలా అయిదువందల రూపాయలు యింగ్లండుకు పంపించవలసి వస్తోంది. తిలోత్తమ చదువుకుకూడా ఏం తక్కువ ఖర్చు కావటం లేదు. కూడబెట్టే అలవాటు లే దాయనకు. ఆయన్ని యిబ్బందిపెట్టటం నా కిష్టంలేదు."

"అప్పుగాయివ్వమంటున్నాను; దానంగా యివ్వమంటం లేదు."

"ఇంత సన్నిహిత సంబంధమున్న చోట అప్పుకు దానం అని తప్ప మరో అర్థం వుండదు. మీరు పైకం యివ్వలేకపోతే ఆయన మిమ్మల్ని చేసేదేమిటి ? కోర్టుకు వెళ్తారా - లోకం నవ్వుతుంది. పంచాయతీముందు పెడతారా- ప్రజలు హేళన చేస్తారు."

"నేను పైకం యివ్వలేనని నీ వెలా ఊహించావేం ?" సంత్ కుమార్ తీక్షణంగా అన్నాడు.

ముఖం ప్రక్కకు తిప్పి అన్నది పుష్ప- "మీకు జయం కలుగుతుందని గ్యారంటీ ఏమీలేదు. ఒకవేళ మీరు గెలుస్తా రనే అనుకోండి; మీకు డబ్బు చేతికివస్తుందనే అనుకోండి. ఐనా తమ ఋణాన్ని తీర్చగల్గిన జమీందార్లు ఈప్రాంతంలో ఎందరున్నారో చెప్పండి ! ప్రతినిత్యం జాగీర్లు 'కోర్టుఆఫ్‌వార్డ్స్' పరం ఔతూనే ఉన్నాయిమరి! పోనీ మీరు పొదుపుగా ఉంటా రనే అనుకుందాం. డబ్బు నిలవచేస్తారనికూడా ఒప్పుకుందాం. కాని మానవస్వభావం ఎలాంటిదం టే అతను జీర్ణంచేసుకోగల్గిన

ధనం జీర్ణమైపోయిందన్నమాటే. ధర్మాన్నీ, నీతినీ మరిచిపోవటం మానవుడి సర్వసాధారణ బలహీనత."

సంత్ కుమార్ పుష్పవైపు కొరకొర చూచాడు. పుష్ప మాటల్లోవున్న సత్యం బాణంలాగా గ్రుచ్చుకుంది. ఆయన మనస్సులో గుప్తంగా ఉన్న దొంగను పుష్ప పట్టుకుని ఎట్టఎదుట నిలవేసింది. "మానవుడంటే యింత నీచంగా భావిస్తున్నావా నువ్వు? ఈ నీ స్వభావానికి నాకు ఆశ్చర్యంగానూ ఉంది; విచారంగానూ ఉంది. ఈ పాపిష్టి కాలంలో కూడా సమాజాన్నింకా నీతీ, ధర్మమే పరిపాలిస్తున్నాయి. ప్రపంచంలో ఈ రెండూ నశించినరోజున, ఈ సమాజంగూడ సర్వనాశనమై తీరుతుంది" కలవరపడుతూ అన్నాడు సంత్ కుమార్.

ధర్మమూ, నీతీ నీటికిగల వ్యాపకత్వాన్ని గురించి ఒక సుదీర్ఘమైన వేదాంతోపన్యాసం యిచ్చాడు సంత్ కుమార్. ఎప్పుడైనా ఏ యింట్లో అన్నా దొంగతనం జరిగితే ఎంత ఆందోళన చెలరేగుతుంది! కారణం? దొంగతనం ఒక అసాధారణ విషయంగనుక. అసలు సమాజమే దొంగలదైతే? ఎవడైనా షాహుకారు కావటం జరిగినా అంతగానే ఆందోళన చెలరేగుతుంది. ఈ రోజుల్లో రోగాలు చాలా విపరీతంగా పెరిగిపోతున్నట్లు వింటున్నాం. కాని పరిశీలించి చూస్తే నూటికి ఒక్కరికి మించి రోగులుండరు. అసలు వ్యాధులే గనుక సర్వసాధారణమైతే ఆరోగ్యవంతుల ఎగ్జిబిషన్లు జరుగుతాయి. వగైరా వగైరా వాదనలన్నీ ఏకరువుపెట్టాడు. పుష్ప విముఖంగా వింటూ ఊరుకుంది. ఆమె వాటన్నిటికీ జవాబు చెప్పగలదు. కాని ఈ చర్చ పొడిగించాలని కోరటంలేదామె. తన తండ్రిని

పైకం అడుగకూడదని మాత్రం నిశ్చయంచేసుకుంది పుష్ప. ఏ తర్క ప్రమాణాలూ ఆమెమీద పలుకుబడి సంపాదించలేక పోయినాయి.

సంత్ కుమార్ ఉపన్యాసం చాలించి ఆమెనుండేమీ జవాబు రాకపోవటం చూచి, ఒక క్షణం ఆగి అన్నాడు— "ఏమిటి ఆలోచిస్తున్నావు? నిజం చెబుతున్నాను. నేను చాలా త్వరలో యిచ్చేస్తాను పైకం."

"కావాలనుకుంటే మీరు స్వయంగా అడగండి? నేను మాత్రం వారికి జాబు వ్రాయలేను." అచంచలంగా అన్నది పుష్ప.

"ఈమాత్రం విషయంకూడా వ్రాయలేవు పాపంనువ్వు! కాని యింటిమీద నాకూ అధికారముందని బల్లగుద్దుతావు మళ్ళీ" పెదవులు నొక్కుకుంటూ అన్నాడు సంత్ కుమార్.

"మీతో ముడివేసుకున్న మరుక్షణంనుండే వచ్చింది నా కా అధికారం" ఆవేశంతో అన్నది పుష్ప.

"అలాంటి అధికారం లభించినంతసులభంగానే ఊడి పోతుందికూడానూ" గర్వంగా అన్నాడు సంత్ కుమార్.

ఏ ఆలోచనాప్రవాహంలో ఆమె అడుగుపెట్టడానికే హడలిపోయేదో, అందులోకేఎవరోఒక్కత్రోపుత్రోసినట్లయింది పుష్పకు. ఆమె కాపురానికివచ్చిన ఒకటిరెండు నెలల్లోనే సంత్ కుమార్ స్వభావాన్ని గుర్తించింది. ఆయనతో కాలక్షేపం చెయ్యాలంటే ఆయన ఆజ్ఞలన్నీ పాలించే దాసీగా పడుండ వలసిందే ఆమె. తన వ్యక్తిత్వాన్ని ఆయన అస్తిత్వంలోమిళితం చెయ్యకతప్పదామె. ఆయన ఆలోచించినట్లుగానే ఆమెకూడా

ఆలోచించాలి. ఆయన చేసినపనులే ఆమెకూడా చెయ్యాలి. ఆమె ఆత్మవికాసాని కక్కడ ఏమాత్రం అవకాశమే లేదు. ఆయనకు యిహలోకంలోనూ, పరలోకంలోనూకూడా ఏమైనా ఉందంటే అది ఆస్తి మాత్రమే. ఆ ఆస్తే ఆయన జీవితాని కుత్సాహాన్ని ప్రసాదించేది. ఆ స్తిముందు భార్యాబిడ్డలుకూడా ఆయన దృష్టిలో విలువ లేదు. ఒక చైనాపింగాణీప్లేటు పుష్ప చేతుల్లోనుండి జారిపడితే ఆమె చెవులు మెలివేశాడు. గచ్చుమీద సిరా పారబోసిన నేరానికి శిక్షగా సంకజ చేత గచ్చంతా కడిగించాడు. ఆయన దాచిన పైకం ఎప్పుడూ తాకనన్నా తాకేదికాదు పుష్ప. ఆయన ధనాన్ని కేవలం సంగ్రహించవలసిన పదార్థంగా భావించడన్నమాట నిజమే. ధనం అనుభవించవలసిన పదార్థమని ఆయన సిద్ధాంతం. కాని అపవ్యయం. అజాగ్రత సహించేవాడుకాడు. తనను తప్ప ఎవరినీ విశ్వసించడాయన. కఠోరమైన ఆత్మత్యాగంతో ఆ జీవితానికి తనను తాను సిద్ధపరచుకున్నది పుష్ప. కాని యిక్కడ తనకేమీ అధికారం లేదనీ, కేవలం దాసీతో సమానమేననీ మాటిమాటికీ జ్ఞాపకం చేస్తుండటం ఆమెకు చాలా అసహ్యంగా ఉంది. ఈ మధ్యనే ఓ రోజున యిలాంటిమాటే విని ఆమె చాలా రోజులు అన్నహారాలు మానేసింది. ఈ రోజువరకూ ఎలాగో మనస్సుకు నచ్చచెప్పుకుని కొంత కుదుటపడింది. ఇంతలోనే తిరిగి గాయం తగిలింది. ఇది ఆమెలో మిగిలిన సహనాన్ని కూడా గొంతు నులిమివేసింది. సంత్ కుమార్ ఆమెను ఛాలెంజిచేసి వెళ్ళిపోయినాడు. ఆమె అక్కడే కూర్చుని యిక తాను చెయ్యగల్గిందేమిటా అని ఆలోచించసాగింది. ఈ స్థితిలో మాత్రం

ఆమె అక్కడ ఉండలేదు. తన తండ్రి యింట్లో కూడా తనకు శాంతి లేదని ఆమెకు తెలుసు. తన తండ్రి కూడా సంత్ కుమార్‌ను ఆదర్శయువకుడుగా భావిస్తాడు. సంత్ కుమార్ ఏదో అనుచితంగా ప్రవర్తించాడని ఆయనకు విశ్వాసం కలిగించటం చాలా కష్టం. పుష్ప వివాహం చేసి ఆయన జీవిత సమస్యల్లో ఒకదాన్ని పరిష్కరించుకున్నాడు. ఆ సమస్యను గురించి తిరిగి ఆలోచించటమనేది ఆయన ఊహాకందని విషయం. ఆయన జీవితాభిలాష యిక హాయిగా, నిశ్చింతగా లోకసంచారం చేద్దామనేదే. ఆ సమయమిప్పుడు సమీపిస్తూ ఉంది. కొడుకు ఇంగ్లండు నుండి రావటం, చిన్నఅమ్మాయి వివాహం కానటం, ఈ రెండూ జరిగిన మరుక్షణమే ఈ సంసార బంధనాలనుండి విముక్తులౌతా రాయన. పుష్ప తిరిగి ఆయనపాలిటపడి ఆయన అతిప్రధానమైన జీవితాభిలాషకు అవరోధంగా తయారవటం ఆమెకిష్టంలేదు. ఇక ఆమెకు మరోస్థాన మెక్కడుంది ? ఎక్కడా లేదు. అయితే ఈ ఇంట్లోనే ఉండి జీవితపర్యంతం అవమానం సహిస్తూ వుండవలసిందే ?

సాధుకుమార్ వచ్చి కూర్చున్నాడు. పుష్ప త్రుళ్ళిపడ్డది. "నువ్వు బొంబాయి వెళ్ళేదెప్పుడు !" అన్నది.

"నిన్ననే వెళ్ళాల్సింది ; కాని వెళ్ళాలనిపించడంలేదు. రానూ పోనూ వందలు ఖర్చవుతాయి. ఇంట్లో డబ్బులేదు. ఎవరినీ పీడించటం నాకిష్టంలేదు. బొంబాయి వెళ్లితీరవలసినంత అవసరం మాత్రం ఏముందీ ? ప్రతి పదిమందికీ తొమ్మిదిమంది అన్నానికి అలమటించిపోయే దేశంలో పది, పదిహేనుమంది

క్రికెట్ వ్యసనంలో మునిగి ఉండటం మూర్ఖత్వమౌతుంది. నేను వెళ్ళదలుచుకోలేదు" అన్నాడు సందేహిస్తూ.

"మీ అన్నగారు డబ్బిస్తారుగా!" ఉత్సాహపరుస్తూ అన్నది పుష్ప.

"అన్నగారు డబ్బేమీ యివ్వరు. నన్ను నాన్నగారి గొంతుమీద కూర్చోమని చెబుతున్నారు. నేను నాన్నగారిని కష్టపెట్టదలుచుకోలేదు. నీకు నమస్కారం చేస్తా; అన్నయ్యతో మాత్రం చెప్పబోకు వదినా!" చిరునవ్వుతో అన్నాడు సాహూ.

పుష్ప అతని వినయ పూర్వకమైన నిష్కాపట్యానికి ఫక్కున నవ్వింది. ఆత్మగౌరవం తొణికిసలాడే యిరవై రెండేళ్ళ యువకు డతను. సత్యాగ్రహ సమరంలో చదువుకు స్వస్తి చెప్పాడు. రెండుమార్లు జైలుకు వెళ్ళి వచ్చాడు. జైలులో మొరటుమాటలు విని ఉద్రేకంలో అతని గుండెలమీద కెక్కి కూర్చున్నాడు. ఈ ఉద్దండతకు శిక్షగా మూడు నెలలు చీకటి కొట్టులో కూడా ఉన్నాడు. అలాంటివాడు తన అన్నగారంటే ఏదో భూతమా అన్నంతగా భయపడతాడు.

"నేను మీ అన్నయ్యతో చెప్పేస్తాలే" అన్నది పుష్ప.

"నువ్వు చెప్పవులే. అంత కఠినురాలవు కాదుగా?"

"నీకెట్లా తెలుసేం?" పుష్ప ప్రసన్నురాలై అన్నది.

"ముఖాన్ని బట్టే."

"వట్టి టక్కరివాడివి."

"ఐతే యింకో విషయం చెప్పనా? యివ్వాళ అన్నయ్య నిన్నూ ఏదో అన్నాడులే!"

"పచ్చి అబద్ధం, ఆయన నన్నేమంటారూ!" సిగ్గు పడుతూ అన్నది పుష్ప.

"ఐతే నామీద ఒట్టుబెట్టుకో."

"ఒట్టెందుకు బెట్టుకోవాలి? నే నెప్పుడైనా ఒట్టుబెట్టు కోంగా చూశావా నువ్వు?"

"అన్నయ్య తప్పక ఏదో అనేవుంటాడు. లేకుంటే నీ ముఖం యింత వాడిపోవటం ఎందుకు జరుగుతుందీ? అన్నయ్యతో మాట్లాడటానికి సాహసించలేకపోతున్నాను. లేకుంటే గతించినవాటిని తవ్వుకోట మెందుకులెమ్మని నచ్చచెప్పేవాణ్ణే. అమ్ముడైపోయిన ఆస్తికోసం నాన్నగారిని నిందించటం, కోర్టు కెక్కటం నా కేమాత్రం నచ్చటంలేదు. ఈ లోకంలో పేద వాళ్లుకూడా ఉన్నారా? అంతా ఆస్తిపరులే నంటావా? నేను నీతో హృదయపూర్వకంగా చెబుతున్నా వదినా! ధనవంతుడు కావాలన్న ఊహ నా మనసులో కలిగితే చాలు, యిక నేనెలా మారిపోతానో అని సందేహంగా ఉంటుంది నాకు. ఇంత మంది దరిద్రుల్లో ధనవంతుడు కావటం పచ్చి స్వార్థమనిపిస్తుంది. నావంటి మానవులే బాధలుపడటం చూచినప్పుడు ఈ స్థితిలో కూడా నామీద నాకు అసహ్యం కలుగుతుంది. మనం రెండు పూటలా నేతిరొట్టెలూ, పాలూ, సీమరేగుపండ్లూ, కమలాలూ ఉడాయించేస్తున్నాం. కాని నూటికి తొంభైమంది ఈ పదార్థాలు కళ్ళజూడనివాళ్ళుకూడా ఉన్నారు. ఇంతకూ మన కేమి కొమ్ములు మొలిచాయి చెప్పు!"

పుష్ప యిలాంటి భావాలు కలది కాకపోయినా సాధూ సత్యస్వభావాన్ని గౌరవించేది. "నీవు పెద్దగా ఏమీ చదివిన

ట్లుండవు. మరి యిటువంటి భావాలు నీ బుర్రలో ఎలా ప్రవే శిస్తున్నాయో !" అన్నది పుష్ప.

"బహుశా క్రిందటి జన్మలో బిచ్చగాణ్ణాయి ఉంటాను" అన్నాడు సాధూ నిలబడి.

"మా చెల్లెలు పాపం నగలకోసం తహతహలాడి పోతుందేమో !" అతని చెయ్యిపట్టుకుని కూర్చోబెడుతూ అన్నది పుష్ప.

నే నసలు పెళ్ళే చేసుకోను."

"ఎక్కడినుండైనా కబురొస్తే బాగుండునని జపంచేస్తూనే ఉంటావులే మనసులో."

"నిజం వదినా ! నీతో అబద్ధం చెప్పను; వివాహం గురించిన ఆలోచనేరాదు నాకు. జీవితమనేది యితరులకు ఉపయోగపడటంకోసం; ప్రజాసేవకుల కెంతగానో అవసరమున్న మన దేశంలో కొంతమంది బ్రహ్మచారులుగా ఉండితీరాలి. ఒకవేళ ఎప్పుడైనా వివాహం చేసుకోదలచినా, నాతోపాటు బీదరికపు జీవితం గడుపుతూ, నా జీవితానికి నిజమైన సహచరిగా మెలగటానికి సిద్ధపడిన అమ్మాయినే చేసుకుంటాను."

"మొట్టమొదట యువకు లందరూ యిలాగే ఉపన్యాసం చేస్తారు. కాని పెళ్ళికావటం ఆలస్యమైందం టే గగ్గోలు ప్రారంభిస్తారు" అతని ప్రతిజ్ఞను ఎగతాళిగా ఎగరగొట్టేసింది పుష్ప.

"వదినా ! నేను వాళ్ళరకంకాదు తెలుసా ? మనస్సు ఎప్పుడైనా చలించటం జరిగితే విషం తినేస్తాను" ఆవేశంతో అన్నాడు సాధుకుమార్.

"నీ మనస్సులో మాత్రం పంకజలాంటి ప్రియురాలు విహరిస్తూనే ఉందిలే!" తిరిగి వ్యంగ్యంగా అన్నది పుష్ప.

"నీతో ఏమాటన్నా ఎగతాళి ప్రారంభిస్తావు. అందుకనే నీ వద్దకు రాను నేను."

"సరేగాని నిజం చెప్పు. పంకజలాంటి పిల్లదొరికితే పెళ్లి చేసుకుంటావా లేదా?

సాధుకుమార్ లేచి వెళ్లిపోయినాడు. పుష్పవారిస్తున్నా చెయ్యి వదిలించుకుని పరుగుతీశాడు. ఆదర్శవాదీ, సరళ స్వభావం గలవాడూ, శీలవంతుడూ, శాంతమూర్తి అయిన ఈ యువకునితో మాట్లాడితే ముకుళితమైపోయిన పుష్పమనో కుసుమం వికసించేది. ఆమె మనసులో ఎంతలోతైన మనిషో పైకి అంత తేలికైన మనిషి. సంత్‌కుమార్ వద్ద ఆమె అనుక్షణం తన హక్కులను రక్షించుకోవలసివచ్చేది. ఆయన ఎప్పుడు దాడిచేస్తాడోనని మెలకువగా ఉండవలసివచ్చేది. శైవ్యా ఎల్లప్పుడూ ఆమెమీద పెత్తనం చెయ్యాలనుకునేది. తాను యింటికి యజమానురాలినన్న సంగతి ఆమె ఒక్కక్షణంగూడా మరిచిపోయేదికాదు. అందువల్ల తన అధికారాన్ని అందరూ గుర్తించి తీరాలనుకునేది. దేవకుమార్ తన భారమంతా సంత్‌కుమార్‌కు వప్పగించి నిజానికి శైవ్యా అధికారాన్ని లాగివేశాడు. దేవకుమార్ యజమానిగా ఉన్నంతవరకే తను యింటికి యజమానురాలన్న విషయం ఆమె మరిచిపోయేది. ఇప్పుడామె పేరుకు మాత్రమే దేవి. తన ఆశీర్వాదాల బలంతో మాత్రమే గౌరవించబడుతుంది. మనస్సులోని తన సందేహాన్ని తీర్చుకోటంకోసం ఆమె ఎల్లప్పుడూ తన అధి

కారాలను పరీక్షించి చూచుకునేది. ఈ శంక ఏదో వ్యాధిలాగా ఆమెలో జీర్ణించిపోయింది. మామూలు భోజనం జీర్ణంచేసుకో లేనందువల్ల ఆమె స్వభావం రుచులు కోరుతుండేది. పుష్ప ఆమెతో మాట్లాడటానికి భయపడేది. ఆమెదగ్గరకు వెళ్ళటానికి సాహసించేదేకాదు. ఇక పంకజ ఉందంటే ఆమె కెప్పుడూ పనిచేసేవ్యాధే. ఆమె పనే ఆమెకు వినోదమూ, కాలక్షేపమూ అన్నీని. నిందించటమనేది ఆమె నేర్చుకోనేలేదు. అచ్చగా దేవకుమార్ స్వభావం ఆమెది.ఎవరైనా నాలుగుమాటలన్నా తలవంచుకుని వింటుంది. ఏ విధమైన ద్వేషమూ, విచారమూ మనసులో చేరనివ్వదు. తెల్లవారుఝామునుండి రాత్రి పది పదకొండు గంటలయ్యేదాకా గుక్క త్రిప్పుకునేందుకు కూడా తీరిక ఉండదు. ఎవరిచొక్కాగుండీలన్నా ఊడిపోతే పంకజ కుట్టిపెడుతుంది. ఎవరిగుడ్డలు ఎక్కడ ఉన్నాయో ఆ గుట్టంతా పంకజకు తప్ప ఎవరికీ తెలియదు. ఇంతపనిచేస్తూ కూడా ఆమె చదువుకోటానికీ, కుట్టుపనులకు కూడా తీరిక ఎలా సంపాదిస్తుందో ఆశ్చర్యం. ఇంట్లోవున్న దిండ్లన్నిటిమీద పంకజ కళాప్రియత్వపు చిహ్నాలు అంకితమైయుండేవి. టేబుల్ గుడ్డలూ, కుర్చీమెత్తలూ, పెట్టె గలేబులూ - ఒక టేమిటి! సమస్తం ఆమె శిల్పశోభలతో విరాజిల్లుతుండేవి. పట్టు, ముఖమల్ గుడ్డలపై రకరకాల పక్షుల బొమ్మలూ, పూల చిత్రాలూ చిత్రించి, ఆమె ఫ్రేములు కట్టించింది వాటికి. అవన్నీ దివాణపుశోభను ద్విగుణీకృతం చేసేవి. ఆమెకు సంగీతంలోకూడా అభిరుచి ఉంది. సితార్ వాయించేది. హార్మోనియం వాయించటమంటే ఆమెకెంతో సరదా. కాని

యితరుల యెదుట మాత్రం పాడటానికీ, వాయించటానికీ బిడియ పడేది. వీటన్నిటితో పాటు ఆమె స్కూలుకుకూడ వెళ్ళేది. ఆమెను చురుకైన పిల్లలలో ఒకతెగా పరిగణించేవారుకూడా. ప్రతినెలా పదిహేనురూపాయల స్కాలర్‌షిప్‌కూడా యిచ్చేవా రామెకు. పుష్పవద్దకు వెళ్ళి కొద్దిక్షణాలు కూర్చుని సరసా లాడుకోవటానికి ఆమె కంత తీరికకూడా లేదు. ఆమెకు సరస మాడటం అసలు చేతగాదుకూడా. పరిహాసాన్ని గ్రహించేదీ కాదూ; దానికి యెదురుజవాబు చెప్పేదీకాదు. పుష్పకు తన బ్రతుకు భారాన్ని కొంత తగ్గించుకోడానికి సాధూఒక్కడే తటస్థపడేవాడు. ఇక భర్తగారు గోరుచుట్టుమీద రోకటి పోటులాగా, తన బరువుకూడా ఆమె నెత్తికే యెత్తాడు.

సాధూ వెళ్ళిపోంగానే పుష్ప తిరిగి అదే ఆలోచనలో మునిగిపోయింది. తన బ్రతుకుభారాన్ని తానే భరించేందుకు ఉపాయమేది ? కనుకనే భర్తగారు తనమీద అధికారాన్ని చలాయించగల్గుతున్నారు. ఆమెను ఎంతగా వేధించుకు తిన్నా తాను ఎక్కడికీ పోలేదనీ, నోరెత్తి మాట్లాడలేదనీ, ఆయన గారికి బాగా తెలుసు. ఔను ! నిజమే ఆయన ధీమా ! తనకు గొప్ప గొప్ప వస్తువులంటే ఎంతో మోజు. శ్రేష్ఠమైన భోజనానికి అలవాటు పడింది. హాయిగా విశ్రాంతి ఉండాలని కోరుకునేది. ఒక్కసారి ఆమె భోగవిలాసాల వ్యామోహాన్ని త్యాగంచేస్తే, త్యాగంచెయ్యటం నేర్చుకుంటే, యిక ఆమెమీద పెత్తనంచేయ గలవారెవరూ ? ఆమె ఒకరికి దాసోహ మెందుకంటుదీ ?

సాయంత్రమైంది. పుష్ప కిటికీ కెదురుగా నుంచుని బయటవైపు చూస్తోంది. ఇరవై, ఇరవై అయిదుమంది స్త్రీలగుంపు

ఒకేస్వరంతో పాటపాడుకుంటూ సాగిపోతుండటం చూచిం దామె. ఎవరి శరీరాలమీదా నిండుగా గుడ్డలుకూడా లేవు. తల మీదా, ముఖంమీదా దుమ్ము అట్టగట్టుకుపోయింది. బహుశా నెలలతరబడి నూనెతగలలేదేమో, వెంట్రుకలు కరుకెక్కిపోయి నాయి. దినమంతా యిటుక అడుసుమోసి యింటికి తిరిగి వస్తున్న కూలీస్త్రీలువాళ్ళు. రోజంతా వాళ్ళు ఎండలో ఉడికి పోయుంటారు. యజమాని చీదరింపులకూ, తిట్లకూ గురై యుంటారు. బహుశా మధ్యాహ్నం ఒకగుప్పెడు సెనగలతోనే సరిపెట్టుకునియుంటారు పాపం! అయితేమటుకేం? ఎంత ఆనందంగా ఉన్నారు! ఎంత స్వేచ్ఛగా ఉన్నారు! వాళ్ళ ఆనందంలోనూ, స్వేచ్ఛలోనూ గల పరమరహస్యం యేమై యుంటుంది.

# 3

ప్రజలు భయంతో గౌరవించే వ్యక్తుల్లో మిస్టర్ సిన్హా ఒకడు. సిన్హాను చూడగానే అందరూ "దయచేయండి! దయ చేయండి!" అంటారు. కాని ఆయన ముఖంచాటున మాత్రం "పరమ దుర్మార్గుడు. పాము కాటుకన్నా మంత్రముందికాని వీడి కాటుకు మంత్రంకూడా ఉండదు" అంటూ ఉంటారు. లేనిపోని తగాదాలూ, దావాలూ సృష్టించటమే ఆయన వృత్తి. కవి తన కల్పనాశక్తిద్వారా ఒక పెద్ద కావ్యాన్నే సృష్టించినట్లు, సిన్హాకూడా తన ఊహాశక్తితో దావాలను సృష్టించేస్తాడు. ఆయన కవి కాకపోవడానికి కారణ మేమిటో తెలియదు మరి. కాని కవిగా ఎంత సాహిత్యాన్ని సృష్టించినా తనకు మాత్రం కించిత్తయినా మేలుచేసుకో గలి గుండడు. కాని చట్టాన్ని ఉపాసించినందువల్ల ఆయన కోర్కె లన్నీ సఫలమైనాయి. భేషైన బంగళాలో నివాసం. గొప్పగొప్ప శ్రీమంతులతోనూ, అధికారులతోనూ స్నేహం, మంచి ప్రతిష్ఠా పలుకుబడీ సంపాదించాడు. ఆయన కలంలోఉన్న మహాత్యమేమి టోగాని దావాకు ప్రాణంపోసేవాడు. ఎటువంటి ఎటువంటి సంద

ర్భాలు పర్చికూర్చేవాడు! ఎలాంటి ఎలాంటిపాత్రలు సృష్టించేవాడు! ఒక్క దెబ్బన కల్పన సజీవంగా తయారయ్యేది. గొప్ప గొప్ప హేమా హేమీలైనవాళ్లుగూడా దానిలోతులు పసిగట్టగలిగేవాళ్ళు కాదు. అంతా ఎంత సహజంగానూ, పగడ్బందుగానూ ఉండేదీ? అబద్ధమేమోనన్న సందేహమన్నా కలిగేది కాదు. ఆయన సంత్ కుమార్ తో పాటు చదువుకున్నాడు. ఇద్దరికీ గాఢమైన స్నేహం. సంత్ కుమార్ మనస్సులో ఒక అభిప్రాయం తలఎత్తింది. సిన్హా దానికి జీవంపోసి ఒక సజీవమైన ప్రతిమగా రూపొందించాడు. ఇవ్వాళ దావా దాఖలు చేయడానికి ఆలోచన జరుగుతోంది.

తొమ్మిదిగంటలై వుంటుంది. వకీళ్ళూ, కక్షిదారులూ కోర్టుకు వెళ్ళే ఏర్పాట్లలో ఉన్నారు. సిన్హా తన అలంకృతమైన గదిలో డ్రాయరుమీద కాళ్లుజాచి పడుకుని ఉన్నాడు. అందగాడు, పొడగరి, సన్నగా ఉంటాడు. వెనుకకు దువ్వుకున్న పెద్ద జుట్టు, చక్కని మీసం, కళ్ళకు జోడు, నోట్లో సిగరెట్, ముఖంలో ప్రతిభ, కళ్లల్లో గర్వం! – ఎవరో గొప్ప శ్రీమంతుడనిపిస్తుంది. సంత్ కుమార్ షేర్వానీ, ఫెల్ట్ కేప్ ధరించి కూర్చున్నాడు. ఎందుకో విచారంగా ఉన్నాడు.

"నువ్వు అనవసరంగా భయపడుతున్నావు. నా మాట విను; విజయం మనదే. కొడుకులూ, మనుమలూ విక్రయ పత్రాలను రద్దుచేయించిన ఉదాహరణలు వందలున్నాయి. గట్టి సాక్ష్యంకావాలి. అంతే! అది సంపాదించట మొకలెక్కలోది కాదు" ఓదారుస్తూ అన్నాడు సిన్హా.

"కాని నాన్నగారిని ఒప్పించాల్సొంటుంది. ఆయన అనుమతి లేకుండా ఏమీ జరుగదు" సందిగ్ధంగా అన్నాడు సంత్ కుమార్.

"ఆయన్ను దారికి తేవడం నీపని".

"కాని ఆయన దారికిరావటం చాలకష్టం."

"ఐతే ఆయన్నుగూడా ప్రక్కకు నెట్టేసెయ్యి. ఆయనకు మతి స్థిరంలేదని మనం రుజువుచేద్దాం."

"అది రుజువు చేయటమంత సులభంకాదు. గొప్ప గొప్ప గ్రంథాలు రచించినవా డాయన. నాగరిక ప్రపంచంలో నాయకుడుగా భావిస్తా రాయన్ను. ఆయన్ను పిచ్చివాడని రుజువుచేయట మెలా?"

"అదంతా నేను చూచుకుంటా. పుస్తకాలు వ్రాయటం వేరూ; మతి స్థిరంగాఉండటం వేరూ! నా ఉద్దేశ్యం అసలు రచయిత లంతా రసపిచ్చగాళ్ళేనని. ప్రశంసలకోసం యీ వృత్తి నవలంబించే ఉన్మాదులు వాళ్ళు. నిజంగా వీళ్ళకు మతి స్వాధీనంలోనే ఉంటే పుస్తకాలు వ్రాయక, ఏ దళారీ వ్యాపారమో చేసేవాళ్ళు. లేకపోతే మిఠాయీలు అమ్ముకునే వాళ్ళు. ఈ పనుల్లో అయితే శ్రమపడ్డందుకు ఫలితం దొరుకుతుంది. పుస్తకరచనవల్ల అజీర్ణం, నిద్రలేమి, 'క్షయ'రోగం యివ్వేగా లభించేది. డబ్బువ్యవహారం నువ్వుచూచుకుంటుండు. మిగతా వ్యవహారమంతా నాకు వదలిపెట్టేసెయ్. ఆఁ! మరిచాను. ఇవ్వాళ సాయంత్రం క్లబ్బుకు తప్పకుండా రా! దాడి యిప్పటినుంచే ప్రారంభించాలి మరి. త్రివేణిని వలలో వేసుకునే ప్రయత్నం ప్రారంభించు. ఆమె సబ్ జడ్జిగారి ఏకైక

పుత్రిక అన్న విషయం గుర్తుంచుకో. మరి ఆమెను ఆకర్షించ గలిగితే నీ రొట్టె నేతిలో పడ్డదన్నమాటే ! సబ్‌జడ్జిగారు త్రివేణిమాట నెప్పుడూ కాదనలేరు. ఇటువంటి చిక్కు వ్యవహారల్లో నీకంటె నేను ఆరితేరినవాణ్ణే. కాని నే నొక హత్యా కేసులో వకాలతు పుచ్చుకున్నాను. మరి సివిలుసర్జను మిస్టర్ కామత్‌గారి అమ్మాయి ఉంది చూచావా-పచ్చగా ఉంటుంది- ఆ అమ్మాయి ప్రస్తుతం నా ప్రియురాలు. సివిల్ సర్జన్ నన్నెంత ఆప్యాయంగా ఆదరిస్తాడని చెప్పనూ ! ఆ పిశాచితో వివాహం విషయం యింతవరకూ ఏమీ నిర్ణయానికి రాలేదులే. పెద్ద పెద్ద పెదిమెలున్నూ, వంగిపోయిన వసారాలాగా ఉంటుంది దాని వక్షస్థలం. అయినా తనకంటె అందగత్తె లీప్రపంచంలో నే లేరని విర్రవీగుతుంది. ఆడవాళ్ళకు తమ అందాన్ని గురించి గర్వం ఎలాకలుగుతుందో నా కింతవరకూ అర్థంకాలేదు. అందగత్తెలు గర్వించినా సబబుగా ఉంటుంది. కాని ముఖం చూడగానే డోకుపుట్టేవాళ్ళుకూడా తాము అప్సరసల మనుకుంటే ఎలా! దాని వెంటబడి ప్రేమ నటించేటప్పుడు వళ్లు మంటెత్తుతుంది. కాని బోలెడు డబ్బు చేతికొచ్చే అవకాశ ముంది. కాస్త ముక్కు-మూసుకోక తప్పదు మరి ! వేణీ నిజంగా అప్సరసే. కాని చంచలమైంది. కొంచెం కష్టంమీదగాని వశం కాదు. నీ సామర్థ్యమంతా వినియోగించవలసి ఉంటుంది" విశ్వాసపూరితంగా అన్నాడు సిన్హా.

"ఆ కళ నేను బాగా అభ్యసించాలే!"

"అయితే యివ్వాళ సాయంత్రం క్లబ్బుకు వస్తావుగదూ!"

"తప్పకుండానూ."

"పైకం ఏర్పాటుకూడా చూడు."

"అదెలాగూ చెయ్యాల్సిందేగా!"

ఈ విధంగా సంత్ కుమార్, సిన్హా లిద్దరూ ముట్టడి ప్రారంభించారు. సంత్ కుమార్ కాముకుడూ కాదు; రసికుడూ కాదు. కాని నటించటం నేర్చినవాడు. అందగాడుకూడానూ. తియ్యగా మాటలు చెప్పగలడు. బలిష్ఠుడు. ప్రసన్నవదనం. ప్రతిభావంతమైన ముఖం. తెల్లని శరీరచ్ఛాయతో కళకళ లాడుతుంటాడు. సూటు వేసుకుని బెత్తం త్రిప్పుకుంటూ బయలు దేరితే కళ్ళల్లో హత్తుకుపోతాడు. టెన్నిస్, బ్రిడ్జి మొదలైన నాగరిక ఆటలలో నిపుణుడుకూడా కావటంవల్ల, వేణితో పరి చయం సంపాదించటానికి యెంతో కాలం పట్టలేదు. వేణి యూనివర్సిటీలో మొదటి సంవత్సరం చదువుతోంది. అతి చురుకయింది. మిక్కిలి గర్విష్ఠి. ఎంతో సమయస్ఫూర్తిగలది. ఆమెకు చదువుమీద అంత శ్రద్ధలేదు. కాని లోకంపోకడతో పరిచయముంది. ఆ పై పై పరిచయానికి పాండిత్య రూప మివ్వడం ఎలాగో తెలుసు వేణికి. ఏ విషయమన్నా తీసుకోండి - అది కేవలం సైన్సువిషయమైనా సరే! - దాని మీద ఆమె ఏదో వ్యాఖ్యచేస్తూనే ఉండేది. ఏదో క్రొత్త విషయాన్ని పరిశుద్ధమైన భాషలో చెప్పాలని ఉబలాటపడేది. అమిత సున్నితమైన స్వభావంగలదామె. మర్యాద, యోగ్యత ఏ మాత్రం లోపించినా ఆమె కసహ్యం. ఆమెనద్ద ఏ సేవకుడూ ఏ దాసీకూడా నిలవగలిగేవాళ్లు కాదు. ఇతరులను ఘోరంగా విమర్శిస్తుంటే ఆమె కెంతో ఆనందంగా ఉండేది. అమితతీక్ష్ణ మైంది ఆమె దృష్టి. ఏ స్త్రీలోగానీ, ఏ పురుషునిలోగానీ,

ఏ మాత్రమైన దుర్వ్యసనాలూ, వికృతచేష్టలూ పసిగట్టిందా ఆమె సహించేదికాదు. కనుబొమలద్వారానో, పెదవుల ద్వారానో తన మనోభావాలను తక్షణమే వ్యక్తంచేసేది. ఆమె దృష్టి అంతా స్త్రీలైతే వారి వస్త్రభూషణాలమీదా, పురుషులైతే వారి మనస్తత్వాలమీదా కేంద్రీకృత మయ్యేది. ఆమెకు తన సౌందర్య మెంత సాటిలేనిదో తెలుసు. చక్కని దుస్తులు ధరించి, తన సౌందర్యాన్ని మరింత శోభింపజేసేది. తన అలంకార పేటికలో తళతళ మెరిసిపోయే నగలను చూసు కుని ఆ మెంతో ఆనందించేది. ఐనా ఆమెకు నగలంటే పెద్దగా మోజులేదు. రోజు కెన్నోసార్లు ఆమె క్రొత్తక్రొత్త డ్రస్సులు ధరించేది. కాసేపు బైతాలీజాతి వేషం. కాసేపు గూర్జరజాతి వేషం వేసేది; మరొకప్పుడు గౌనూ, మేజోళ్ళూ ధరించేది. కానీ ఆమె మనస్సులో పురుషులను ఆకర్షించుదామనే భావం లేశంకూడా లేదు. తనకు తానే సౌందర్యారాధనలో తన్మ యత్వం చెందేది.

కాని దాంతోపాటు ఆమె చనువుగా ఉండేదికాదు. యువకుల ముఖతా ప్రేమపూరిత వచనాలు విని ఆమె ఏమాత్రం చలించేదికాదు. ఈ విషయంలో సాధారణ సౌందర్య ప్రశంసమినహా, ఆమె మరి దేనికీ ప్రాధాన్యత యిచ్చేదికాదు. ఇక యువకులు ఆమెనుండి ఏ విధమైన ప్రోత్సాహం లభించక నిరాశు లయ్యేవాళ్ళు. కాని సంత్ కుమార్ రసికత్వంలో ఏదో రహస్యం, నిపుణత అంతరాత్మకు గోచరించింది. ఇతర యువకులలో ఆమెకు కనుపించిన ఆ యింద్రియలోలత్వం, తొందరపాటు, తహతహ సంత్

కుమార్‌లో మచ్చుకైనా కనుపించలేదు. సంత్‌కుమార్ యొక్క ప్రతిచేష్టలోనూ యింద్రియనిగ్రహం, మర్యాదా, జాగరూకతా తొణికిసలాడేవి. కనుకనే ఆమె ఆయనతో మెలకువగా ఉంటూ, ఆయన మనస్తత్వాన్ని అధ్యయనం చేయటానికి ప్రయత్నిస్తుండేది. సంత్‌కుమార్ యొక్క సంయమం, ఆలోచనాశక్తి - యివే వాటి గాఢమైన గూఢత్వంవల్ల తమవైపుకు ఆకర్షించుకుంటున్నాయి. ఆమెవద్ద సంత్‌కుమార్ తన నొక యిష్టంలేని వివాహానికి ఎరమైన బలిపశువులాగా చిత్రించుకున్నాడు. దాని ఫలితంగా ఆయనకు ఆమెనుండి కొంత సానుభూతి లభించింది. వేణికెంతమాత్రం సాటిరాని పుష్ప సౌందర్యాన్ని, తన స్వార్థానికి అవసరమనుకున్నంతవరకూ ప్రశంసించాడు సంత్‌కుమార్. ఆయన పుష్పలో మొరటుతనం, మూర్ఖత్వం, నిర్దయ, నిష్ఠురత్వం వగైరా అవగుణాలు మూర్తీభవించి ఉన్నాయని ఆరోపించాడు. తత్ఫలితంగా పుష్ప కంటబడితే, వేణి తన తరఫున ఆమెతో వాదించేటంతగా ఆమెనాకర్షించాడు సంత్‌కుమార్.

ఒకరోజు ఆమె సంత్‌కుమార్‌తో అన్నది— "మీరు ఆమెను వదిలిపెట్టకూడదూ?"

"ఎలా విడిచిపెట్టను మిస్ త్రివేణీ! సంఘంలో వున్నప్పుడు సంఘపు కట్టుబాటును మన్నించి తీరవలసిందే. అదీగాక యిందులో పుష్ప చేసిన నేర మేముందీ? ఆమె తనను తాను సృష్టించుకుందా? భగవంతుడనుకో, సంస్కారమనుకో, పరిస్థితులనుకో - ఎలా తయారుచేస్తే అలా తయారైంది" ఖిన్నుడై అన్నాడు సంత్‌కుమార్.

"మెడకు తగులుకున్న దిగనుక డోలువాయించక తప్పదనే మనుషులంటే నా కెంతమాత్రం సానుభూతి లేదు. ఆ డోలును మెడనుండి తీసి ఏ కందకంలోనో విసిరిపారెయ్యాలంటాను నేను నా కధికారముంటే ఆ పని నేనే చేసేదాన్ని."

తన మంత్రం పారటం గమనించి లోలోపలే సంతోషిస్తూ అన్నాడు! సంత్ కుమార్ — "కాని ఆమె గతేమవుతుందో ఆలోచించారూ!"

"ఆమె తన యింటికి వెళ్ళిపోతుంది. లేకుంటే ఏదో పనిచేసుకుంటుంది. అదీగాకపోతే తన స్వభావానికి సరితూగే మరో వ్యక్తిని వివాహమాడుతుంది. మీ కా విషయం ఆలోచించవలసిన పనేముంది?" చికాకుగా అన్నది వేణీ.

"వేణీకి వాస్తవానికీ, కల్పనకూగల తేడాకూడా తెలియదు. ఎంత అమాయకం?" పకపక నవ్వి అన్నాడు సంత్ కుమార్.

"ఇది చాలా క్లిష్టసమస్య త్రివేణీ! ఈ సంఘపు నీతి ఏమిటో తెలుసా? పుష్పను చూస్తుంటే నిత్యం నా రక్తం ఉడికిపోతుంటేమటుకేం! ఆ బాధతో ఏదో ఒకరోజు నేను నా కంఠం తెగగోసుకుంటేమటుకేం! సంఘాని కేమీ నష్టం లేదు. కాని విడిచిపెట్టటంమాత్రం అసంభవం. ఒక్క కారణంతో మాత్రం ఆమెను వదిలివెయ్యగలను. అది ఆమె శీలదోషానికి సంబంధించిన విషయం. పుష్పలో ఎన్నిదోషాలైనా ఉండవచ్చును గాని, ఈ దోషంమాత్రం లేదు" గంభీరమైన ఔదార్యం ప్రదర్శిస్తూ అన్నాడు సంత్ కుమార్.

సాయంత్రమైనది. వేణీ నౌకరును పిలిచి తోటలో తిన్నెమీద కుర్చీలు వెయ్యమనిచెప్పి తోటలోకి వచ్చేసింది. ఈపని

చేసిపోవటమే తరువాయి అన్నట్లుగా నౌకరు కుర్చీలు తెచ్చి వేశాడు.

"కుర్చీలు తుడవలేదేం? కనబడటంలా వాటిమీద ఎంత దుమ్ముందో? ఎన్నిమాట్లు చెప్పాను నీకూ!? ఐనా నీకు జ్ఞాపకమే ఉండదు. జరిమానా వెయ్యందే నీకు జ్ఞాపకముండదులే" గద్దిస్తూ అన్నది వేణీ.

నౌకరు కుర్చీలు రుద్దీరుద్దీ శుభ్రంచేశాడు. మళ్ళీ వెళ్ళబోయాడు.

"ఎందు కలా మాటిమాటికీ పారిపోతావ్? డ్రాయరు తీసుకొచ్చావా? టీ టేబిల్ తీసుకురాలేదేం? టీ నీ నెత్తిన బెట్టుకు త్రాగుతామనుకున్నావా!" తిరిగి గద్దించింది వేణీ.

ఆమె వృద్ధనౌకరు చెవులురెండూ మెలివేసింది. "వట్టి మందమతి. శుద్ధమూర్ఖుడు. వట్టి మట్టిబుర్ర వీడిది"; ఒక్క నెట్టు నెట్టి అన్నది వేణీ.

ఆ వృద్ధనౌకరు ఎన్నాళ్ళనుండో ఉంటున్నాడు. ఇంటి యజమానురాలు అతనిని ఎంతో ఆదరంగా చూచేది. ఆమె స్వర్గస్థురాలైన తరువాత అతను పెద్దగా ఆశకలవాడు - కాక పోవటంచేతనూ, యజమానురాలియెడల అతనికిగల భక్తి శ్రద్ధలవల్లనూ – యిక్కడకంటే ఒకటిరెండు రూపాయలు ఎక్కువ జీతంతో నౌకరీ దొరికే అవకాశమున్నప్పటికీ – అతనా యింటికేబంధితుడైనాడు. అనాదరణ, అవమానం సహిస్తూ కూడా ఇత నా యింటికే అంటుకుపోయినాడు. సబ్ జడ్జిగారు కూడా అతన్ని గదమాయిస్తుండేవారు. కాని వారు కోప్పడ్డందుకు అతని కేమీ కష్టంకలిగేదికాదు. ఆయనగారు వయ

సులో అతనికి సమానమైనవాడు. కాని తాను త్రివేణిని తన ఒడిలో ఉంచుకుని ఆడించాడు. ఇప్పు డా వేణియే అతన్ని గద్దిస్తున్నది. దెబ్బలుకూడా కొడుతున్నది. ఇందువల్ల అతని శరీరానికి కలిగేబాధకంటే, ఆతని ఆత్మగౌరవానికి కలిగేబాధ ఎంతో తీవ్రంగాఉంది. అతను నౌకరీచేసిందల్లా రెండుకుటుంబా ల్లోనే. రెండుకుటుంబాల్లోనూ ఆడపిల్ల లుండేవాళ్ళు. కొడుళ్ళు కూడా ఉండేవాళ్ళు. కాని అందరూ ఆతనిని ఆదరించేవాళ్ళు. అతనంటే బిడియపడేవాళ్ళుకూడాను. అతనివల్ల ఏ పనైనా పాడైపోవటం జరిగినా, మనసులోనే ఉంచుకునేవాళ్ళు. అతని యజమానురాలు ఆదర్శ మహిళామూర్తి. అత న్నెప్పుడూ పల్లెత్తుమాటనలేదు. బాబుగారు ఎప్పుడన్నా కోప్పడ్డా, ఆతని పక్షంవహించి అయనతో వాదించేది. కాని ఈ అమ్మాయి పెద్దా, చిన్నా తారతమ్యంకూడా చూడదు. విద్యవల్ల విజ్ఞానం కలుగుతుందటారు. ఇదేనా ఆ విజ్ఞానం ! ఆతని హృదయంలో ద్వేషభావాలు చెలరేగాయి— ఈ అవమానా న్నెందుకు సహిం చాలి. తన స్వంతకూతురుకంటేకూడా చిన్నపిల్లచేత చెవులు మెలివేయించుకోటమా ? వయస్సులోకూడా అభిమానముంది. అది చెమటోడ్చి సంపాదించిన ధనంవల్ల కలిగే అభిమానాల కేమీ తీసిపోదు. గౌరవం, ప్రతిష్ఠ తన జన్మహక్కని భావిస్తుం దది. అందుకు బదులుగా అవమానం పొందినప్పుడు తల్లడిల్లి పోతుంది.

ఘూరా టీ టేబిల్ తెచ్చిపెట్టాడు. కాని కళ్ళలో ద్వేషం రగులుతూనే ఉంది.

"వెళ్ళి బైరాతో రెండు కప్పులు టీ యిచ్చిపొమ్మని చెప్పు" ఆజ్ఞాపించింది వేణీ.

ఘూరా వెళ్ళిపోయినాడు. బైరాకు ఆ మాట చెప్పి, తన ఏకాంత కుటీరానికి వెళ్ళి భోరున విలపించాడు. యజమాను రాలే జీవించి ఉంటే, ఈరోజు యిలాంటి అవమానం జరిగే దేనా!

బైరా టీ తెచ్చి టేబిల్ మీద ఉంచాడు. "పతివ్రత లుగా ఉండేది స్త్రీలే కాదనీ, పురుషుల్లోకూడా పత్నీవ్రతు లుంటారనీ యిప్పుడే తెలుస్తోంది" టీ కప్పు సంత్ కుమార్ కందిస్తూ పరిహాసంగా అన్నది వేణీ.

"కనీసం అలాగే నాటక మాడుతుంటారు" సంత్ కుమార్ ఒక గుటక వేసి అన్నాడు.

"అది నేను నైతిక బలహీనతంటాను. ఎవరినైనా హృదయపూర్వకంగా ప్రేమిస్తుంటేనే ప్రేమిస్తున్నా ననాలి— లేదూ స్పష్టంగా బయటపడాలి. నేను వివాహాన్ని ప్రేమ బంధంగా భావిస్తాను. ధర్మ నిర్బంధమన్నా, సాంప్రదాయ నిర్బంధమన్నా పరమ అసహ్యం నాకు."

"ఐనా అందుకూ పురుషులే ఆక్షేపించబడుతున్నారు" వేణీ త్రుళ్ళిపడ్డది. విషయం స్త్రీ పురుష జాతి సమస్యగా పరిణమిస్తోంది.

ఇప్పుడామె తన జాతి పక్షం వహించక తప్పదు— అయితే మీరు నాచేత పురుషులందరూ దేవతాస్వరూపులని ఒప్పించా లనుకుంటున్నారా? మీరు ప్రకటించే నిజాయితీకూడా హృదయపూర్వకమైందికాదు;లోకనిందకు భయపడిమాత్రమే.

ఇది నిజాయితీ అనను నేను. తేలును దాని కొండె విరిచివేసి సంపూర్ణ శాంతిజీవిగా చెయ్యవచ్చు. కాని అందువల్ల తేళ్ళ కుండే విషతత్వం నశించదు."

"ఎక్కువమంది స్త్రీల పాతివ్రత్యంకూడా లోకనిందకు భయపడేనని నే నంటే తమరేమంటారు ?" తన ఓటమి నంగీక రిస్తూనే అన్నాడు సంత్ కుమార్.

"నే నామాట యెన్నటికీ అంగీకరించను" వేణీ కప్పు టేబుల్ మీాద ఉంచుతూ అన్నది.

"ఎందుకనో ?"

"పురుషుడు స్త్రీలకు మరో ఆధారం మిగలనిస్తేగా ! పాతివ్రత్య ధర్మం వాళ్ళకు ఘోరాతిఘోరంగా యింజెక్టు చెయ్యబడ్డది. ఇక స్త్రీలకు తమ వ్యక్తిత్వమంటూ మిగిలితేగా ! ఆమె కేవలం పురుషుడిమీాద ఆధారపడిమాత్రమే జీవించ గల్గుతుంది. ఆమె కిక స్వతంత్రవ్యక్తిత్వమనేది శూన్యం. అవివాహితుడైన పురుషుడు హాయిగా తింటాడు; తిరుగుతాడు; మీాసం మెలివేస్తాడు. కాని అవివాహితురాలైన స్త్రీ ఏడు స్తుంది; మొత్తుకుంటుంది. తన్ను తాను ప్రపంచంలోకల్లా నికృష్ట జీవి ననుకుంటుంది. ఇదంతా పురుషుల అపరాధమే. దీనికై విడిచిపెట్టటాని కిష్టంలేని పురుషులు కాబట్టేగా మీారు పుష్పను వదిలివెయ్యండీ!"

"మీారు నామీాద అన్యాయమైన ఆరోపణ చేస్తున్నారు. నేను పుష్పను వదిలిపెట్టటంలేదంటే, ఆమె జీవితం నాశన మౌతుందేమోనన్న బెంగచేతగాదు. నే నామెను వదిలేస్తే

యితరులతో పాటు తమరూ నన్ను చిన్నచూపు చూస్తారు" ఎంతో బాధపడుతూ అన్నాడు సంత్ కుమార్.

"నావిషయంలో మట్టుకు నిశ్చింతగా ఉండండి" చిరునవ్వుతో అన్నది వేణీ. కాని మరుక్షణంలోనే గంభీరంగా అన్నది – "కాని నేను మీ చిక్కులేమిటో అర్థం చేసుకోగలను."

"మీ ముఖతా ఈ మాటలు విని నాకెంతో సంతృప్తి కలిగింది. నేను వాస్తవంగా మీదయకు పాత్రుణ్ణి. దానవసరం ఎప్పుడైనా కలుగుతుందేమో !"

"మీరంటే నాకు నిజంగా జాలివేస్తుంది. ఏదోవిధంగా ఒకరోజు ఆమెకు నన్ను పరిచయం చెయ్యకూడదూ! బహుశా నేను ఆమెను దారికి తేగలుగుతానేమో !"

ఈ ప్రతిపాదనతో ఆయువుపట్టులో గాయపడ్డవాడిలాగా వెలవెలబోయినాడు సంత్ కుమార్.

"ఆమె దారికి రావటం అసంభవం మిస్ త్రివేణీ! ఆమె ఎదురు మిమ్మల్నే విమర్శిస్తుంది. మీ విషయంలో ఎన్నెన్ని దుష్టకల్పనలు చేస్తుందో చెప్పలేం. ఇక నేను యింట్లో ఉండటమే దుర్భరమైపోతుంది" తెప్పరించుకుని అన్నాడు సంత్ కుమార్.

"అయితే ఆమెను నేను కలుసుకుతీరతాను" వేణీ సాహసిక హృదయం ఉత్తేజితమైంది.

"అలా అయితే బహుశా నేనిక్కడకు వచ్చే అవకాశం కూడా లేకుండా చేస్తారన్నమాట."

"అలా ఎందుకు జరగాలి ?"

"ఆమె మీ సానుభూతి పొందటం, మీ రామెను సమర్థించటం సంభవించవచ్చు."

"అయితే యక్స్‌పార్టీ డిక్రీ యిచ్చెయ్యాలనా మీ కోరిక ?"

"నేను కేవలం మీదయ, సానుభూతిమాత్రమే కోరుతున్నాను. మీతో నా మనోవ్యథంతా వెళ్ళబోసుకుని హృదయభారం తగ్గించుకోవాలని నా కోరిక. నేను మీయింటికి వస్తూపోతూ ఉన్నానని తెలిస్తే, మరో క్రొత్తరగడ ప్రారంభించిందన్నమాటే."

"అయితే మీరు ఆమె కింతగా భయపడతారేం ? అసలు భయపడవలసింది నేనూ!" సూటియైన వ్యంగ్యంతో అన్నది వేణీ.

"నేను మీగురించే భయపడుతున్నాను. నా కోసం కాదు" మరింత చొరవతీసుకుని అన్నాడు సంత్‌కుమార్.

"అక్కరలేదండీ! మీరు నా కొరకేమీ భయపడనక్కరలేదు" నిర్భయంగా అన్నది వేణీ.

"నేను జీవించి ఉండగా నావల్ల మీకు అపనింద రావటం సహించలేను."

"నాకు భావుకత్వం గిట్టదని మీకూ తెలుసుగా !"

"ఇది భావుకత్వం కాదు; నా స్వచ్ఛమైన మనోభావాలివి."

"స్వచ్ఛమైన భావాలుగల యువకులను చాలా తక్కువమందిని చూచాను నేను."

"ప్రపంచంలో అన్నిరకాలవాళ్ళూ ఉంటారు."

"ఎక్కువమంది వేటగాళ్ళ బాపతే. స్త్రీలలో వేశ్యలు మాత్రమే వేటాడుతారు. పురుషుల్లో నూటికి నూరుగురూ వేటగాళ్ళే."

"పొరపాటు. అందులో చేరనివాళ్ళుగూడా ఉంటారు."

"స్త్రీ సౌందర్యం చూడదు. పురుషు డెప్పుడూ సౌందర్యం వెంటబడతాడు. అందుకనే పురుషుణ్ణి విశ్వసించ టానికి వీల్లేకుండా ఉంది. నా వద్దకు సౌందర్యోపాసకు లెందరో వస్తుంటారు. బహుశా యిప్పుడుగూడా యే మహాశయుడైనా వస్తూ ఉండవచ్చు. నేను రూపసి నన్నమాట నిజమే. ఈవిష యంలో మొగమాటపడవలసిందేమీ లేదు. కాని ఎవరైనా కేవలం సౌందర్యంకోసం నన్ను ప్రేమించటం నా కెంతమాత్రం యిష్టంలేదు."

"మీరు నన్ను వాళ్ళలో ఒకనిగా పరిగణించటం లేదు గదా ?" కంపిత హృదయంతో ప్రశ్నించాడు సంత్ కుమార్.

"మిమ్మల్ని నా ప్రేమికుల్లో ఒకరుగా పరిగణించటమే లేదు !" చమత్కారంగా అన్నది వేణి.

"అది నా దురదృష్టం" తల వంచుకుని అన్నాడు సంత్ కుమార్.

"మీ రా మాట హృదయపూర్వకంగా అనటంలేదు. మిమ్మల్ని నేను అర్థం చేసుకోలేకపోతున్నాను. మీరు చాలా నిగూఢ హృదయులని తోస్తున్నది."

"సరిగ్గా యిదే అనుకుంటుంటాను మిమ్మల్నిగురించి."

"నే నేమీ రహస్యాన్ని కాదు. నా హృదయాంతరాళంలో నిద్రావస్థలో ఉంది నా ప్రేమ. దాన్ని జాగృతం చేయగల వ్యక్తికోసం వెదకులాడుతున్నాను. ఈ విషయం నేను విస్పష్టంగానే చెబుతున్నాను. నిజమే ! నా ప్రేమ అడుగున ఎంతో అగాధంలోఉంది. అగాధ సంద్రంలో మునకలు వేయగలవానికే లభిస్తుం దది. మీలో ఎప్పుడూ నా కా తహతహ కనిపించలేదు. ఇంతవరకూ నేను జీవితంలో వెలుగు భాగమే చూచాను. ఇక దాంతో విసుగెత్తిపోయాను. త్యాగం, ఆవేదన, ఆత్మ సమర్పణ చిందులాడే జీవితంలోని చీకటికోణాన్ని కూడా దర్శించాలనుంది. ఆ జీవితం అం టే చాలా త్వరలోనే అసహ్యం కలుగవచ్చు ! కాని, ఉన్నత పదవిలోని బానిసత్వంగానీ, చట్టసంబంధమైన మోసంగానీ, వ్యాపారం పేరుతో జరిగే దోపిడీగానీ, జీవనాధారంగా చేసుకోటానికి నా హృదయం అంగీకరించదు. శ్రమ, త్యాగాలతో నిండిన జీవితమే నాకు వాస్తవికమైన దనిపిస్తున్నది. సంఘమూ, దేశమూ ఈనాడున్న పతనావస్థను గురించి పట్టించుకోకుండా ఉండటం కంటె అవివేకం లేదు. ఒక్కొక్కసారి నన్ను చూస్తే నాకే అసహ్యం వేస్తుంటుంది. నాన్నగారికి తన చిన్న కుటుంబంకోసం వెయ్యిరూపాయలు పుచ్చుకోటానికి హక్కెక్కడిది ? నే నీ విధంగా పనీ, పాటూ లేకుండా యింత విశ్రాంతిగా ఉండేందుకు నా కే మధికార ముందీ ! కాని, యిదంతా తెలిసీగూడా నాకు పనిచేసే శక్తి లేదు. ఈ భోగవిలాసాల జీవితం నన్ను గూడా సోమరిగా తయారుచేసింది. నా స్వభావంలో ధనికతత్వం ఎంతగా ఉందో మీరు గ్రహించే ఉంటారు. నా నోటినుండి

మాట బయటికివచ్చిన మరుక్షణంలో నాకోరిక నెరవేరకపోతే పిచ్చెత్తిపోతుంది నాకు. బుద్ధికి మనస్సుమీద ఏమాత్రం కంట్రోలు లేదు. మాటిమాటికీ నిషేధించినా త్రాగుడు మానలేని త్రాగుబోతు స్థితిలో ఉన్నాను. ఆ త్రాగుబోతు మాదిరే నా యిచ్ఛాశక్తి విశృంఖలమై పోయింది."

ప్రతిభావంతమైన వేణీ వదనంలో తరుచు చంచలత్వం చిందులాడు తుండేది. ఆమెతో మనసులో మాట చెప్పటానికి జంకుజంకుగా ఉండేది. ఎందువల్లనంటే ఆమె సానుభూతిగా వింటానికిబదులు వ్యంగ్యోక్తులు విసరుతుందేమోనని సందేహంగా ఉండేది. కాని, యీ సమయంలో ఆమె అంతరాత్మే మాట్లాడుతున్న ట్లనిపించింది. ఆమెకళ్ళు చెమ్మగిలినాయి. ముఖంలో నిశ్చింతతో కూడిన వినయం, సుకుమారం వికసించింది. ఆమె నిగ్రహం సడలిపోవటం గ్రహించాడు సంత్ కుమార్. చాలా సేపటికి హఠాత్తుగా దాత దర్శనం లభించిన బిచ్చగాడు తన గోడు చెప్పుకునేందుకు ఆరాటపడ్డట్టుగా ఉంది సంత్ కుమార్ స్థితి.

"ఎన్నో సార్లు సరిగ్గా యిలాంటి అభిప్రాయాలే నాకూ కలిగినాయి. నే ననుకున్న దానికంటే మీకు మరింత సన్నిహితంగా ఉన్నాను నేను" అన్నాడు సంత్ కుమార్.

"మీ రెప్పుడూ నాతో అనలేదే" సంతోషంతో అన్నది వేణీ.

"మీరుకూడా ఈ రోజేగా మనసు విప్పటం !"

"మీ ఉనికేమో యింత శీవిగా ఉంటుంది; కాని, కబుర్లేమో అలా చెబుతుంటారని లోకు లాక్షేపిస్తారేమో నని

నాకు భయంగా ఉంటుంది. నా ధనికతత్వపు అలవాట్లు వదిలించుకునేందు కేమైనా ఉపాయాలుంటే అవి తప్పక అమలులో పెడతాను. ఈ విషయానికి సంబంధించిన పుస్తకా లేమైనా మీవద్ద వుంటే నా కివ్వండి. మీరు నన్ను తమ. శిష్యురాలిగా స్వీకరించండి."

సంత్ కుమార్ రసికభావంతో అన్నాడు — "నేనే మీ శిష్యుణ్ణి కాబోతుంటే!" అంటూ ఆమెపై భావ యుక్తమైన చూపులు ప్రసరించాడు.

వేణీ రెప్పలు వాల్చలేదు. "మీరు పరిహాస మాడు తున్నారు. నాకు క్లిష్టపరిస్థితుల్ని ఎదుర్కొనగలిగే శక్తి సమ కూర్చండి. నేను స్త్రీని గాకపోతే యింత బలహీనురాలను కానుగదా అని మాటిమాటికి విచారంగా ఉంటుంది నాకు" సంత్ కుమార్ చెయ్యిపట్టుకుని అన్నది వేణీ.

ఈరోజు సంత్ కుమార్ కు తెలియకుండా ఏ విషయమూ దాచిపెట్టాలన్న ఉద్దేశం ఆమె కేమీ ఉన్నట్లులేదు. ఆమె ఎంతో కాలంనుండీ శోధిస్తున్న ఆధారం అకస్మాత్తుగా లభించి నట్లుగా ఉంది ఆమెకు.

"పురుషులకంటే స్త్రీలే సాహసంగలవాళ్ళు మిస్ త్రివేణీ!" కఠిన స్వరంతో అన్నాడు సంత్ కుమార్.

"సరేగాని చేతనైతే ఈ లోకంలో వున్న వ్యవస్థ మొత్తం మార్చివేద్దామనిపించటం లేదా మీకు?"

పరిశుద్ధ హృదయంనుండి వెలువడిన యీ ప్రశ్నకు కృత్రిమ సమాధాన మివ్వటానికి సంత్ కుమార్ హృదయం కంపించిపోయింది.

"అబ్బ! ఏమని చెప్పనూ! మానవుడొక నిట్టూర్పు విడిచి స్తంభించిపోతాడు" అన్నాడు సంత్‌కుమార్.

"నేను తరుచు రాత్రులు యీ ప్రశ్నను గురించే ఆలోచిస్తూ, ఆలోచిస్తూ నిద్రపోతాను. ఆ స్వప్నాలే చూస్తుంటాను. లోకంలో జనమెంత స్వార్థులుగా జీవిస్తున్నారో చూడండి. సంఘాన్ని మొత్తం ఉద్ధరించగలిగిన సాంఘిక వ్యవస్థ కొద్దిమంది వ్యక్తుల స్వార్థం కారణంగా అణగి పడుంటున్నది."

"దానిరోజు వచ్చేస్తోంది!" చిన్నబోయిన వదనంతో అన్నాడు సంత్‌కుమార్. అని లేచి నుంచున్నాడు. అక్కడి వాతావరణంలో ఆయనకు శ్వాస ఆగిపోతున్నట్లుగా ఉంది. ఈ నిష్కల్మష, సరళ వాతావరణంలో తన నీచత్వాన్ని గ్రహించిన ఆయన కల్మష హృదయం కుంచించుకుపోతోంది. ధర్మనిష్ఠ గల వ్యక్తిహృదయంలో అధర్మపు ఆలోచన ప్రవేశించినా ఆ ఆలోచనకు యింకా స్థిరమైన పునాది లభించనట్లుగా ఉంది సంత్‌కుమార్ స్థితి.

"ఇంకాసేపు కూర్చోరూ?" బలవంతం చేసింది, వేణీ.

"నేటికి సెలవివ్వండి; తిరిగెప్పుడన్నా వస్తాను."

"ఎప్పుడు వస్తారూ?"

"త్వరలోనే వస్తాను."

"నేను తమ జీవితం సుఖవంతం చెయ్యగలిగితే ఎంత బాగుంటుంది!"

సంత్‌కుమార్ బంగళాపంచలోనుండి ఒక్క గంతులో క్రిందికివచ్చి ఆవరణదాటి వెళ్ళిపోయాడు. వేణీ వసారాలో నుంచుని ప్రణయ దృక్కులతో చూస్తూ నిల్చుండిపోయింది.

ఆమెది గట్టిగుండె; చంచలస్వభావం గలది. రూపగర్విత. చతురురాలు. ఎవరినీ లెక్క జేసేదిగాదు. ప్రేమనటించి ఆమె నెవరూ మోసం చెయ్యగలిగేవాళ్లు కాదు. అనేకమంది వేశ్యల్లో వారి వ్యాసంగా లన్నిటిమధ్యా భక్తిభావం గుప్తంగా వున్నట్లు గానే వేణీ హృదయంలో కూడా సమస్త అపనమ్మకాలమధ్య కించిత్ నమ్మకం గుప్తంగా స్థానం సంపాదించింది. దాన్ని స్పర్శించగలిగిన నేర్పుగలవ్యక్తి ఆమెను మూర్ఖురాలిని చెయ్య గలడు. ఆ కోమలస్థానం స్పృశించబడిన మరుక్షణమే ఆమె నిరాడంబరమూ, సరళమూ, విశ్వాసపూర్ణమూ అయిన పిరికి పిల్లగా మారిపొయేది. ఈరోజు దైవికంగా సంత్ కుమార్ ఆ స్థానం సంపాదించాడు. ఇక వేణీని ఆయన తన యిష్ట మొచ్చిన నైపుకు తీసుకుపోవచ్చు. మెస్మరిజానికి గురైనదా అనిపిస్తున్న దామె స్థితి. ఇప్పుడామెకు సంత్ కుమార్‌లో దోసగులేమీ కనబడటంలేదు. ఆ దౌర్భాగ్యపు పువ్వు ఈ సత్పురుషుని జీవితం ఎంత ధ్వంసం చేస్తోంది! ఆయనకు ఉత్సాహమిస్తూ అన్ని వేళలా ఆయన్నంటిపెట్టుకు తిరిగే సహ భాగిని కావాలాయనకు. తాను ఆయన జీవితానికి రాహు గ్రహంగా తయారై సంఘానికెంత అనిష్టం కలిగిస్తుందో పువ్వుకు తెలియదు. మరి యిటువంటి పరిస్థితుల్లో కూడా సంత్ కుమార్ ఆమెను మెడకు గట్టుకున్నాడంటే అది దేవత్వానికేమీ తీసి పోదు. ఆయనకు వేణీ ఎలా సేవ చెయ్యగలుగుతుంది; ఏ విధంగా ఆయన జీవితం సుఖవంతం చెయ్యగలుగుతుంది!

# 4

సంత్ కుమార్ యిక్కడినుండి వెళ్ళేటప్పుడు అతని హృదయం గగనమండలంలో విహరిస్తోంది. ఇంత శీఘ్రంగా దేవి తనకు వరం ప్రసాదిస్తుందని ఆశించలే దతను; అదృష్టం కలిసొచ్చింది. కాకుంటే మహామహావాళ్ళనే నాట్యం చేయించే యువతి అతని యెడల ఎందుకంత భక్తిశ్రద్ధలు ప్రదర్శిస్తుంది? ఇక అతను జాగుచేయకూడదు. వేణీ ఎప్పుడు ఎదురుతిరుగుతుందో ఎవరికి తెలుసు! మరో రెండుమూడు సమావేశాల్లోనే అలా జరగబోతుంది. వేణీ అతన్ని కార్యక్షేత్రంలో ముందంజ వేయమని ప్రోత్సహిస్తుంది. అప్పుడతను వెనకాడుతాడు. అక్కడే విభేదా లేర్పడుతాయి. అక్కడనుండి సంత్ కుమార్ తిన్నగా సిన్హాయింటికి వచ్చేశాడు. సాయంత్రమైంది. మంచు కురవటం ప్రారంభమైంది. మిస్టర్ సిన్హా టాయిలెట్ అయి ఎక్కడికో వెళ్ళటానికి తయారైనాడు. ఇతన్ని చూడంగానే ప్రశ్నించాడు –

"ఎక్కడినుండి రావటం ?"

"అక్కడినుండే. ఇవ్వాళ వశీకరణ జరిగిపోయింది."

"నిజం !"

"ఔనోయ్! ఆమెపై నేను మంత్రదండం ప్రయోగిం చేశా ననుకో!"

"ఇక లెక్కేమిటి? పందెం గెలిచావన్నమాటే. అయితే మీ నాన్నతో యివ్వాళే ప్రస్తావించు."

"తమరుకూడా నా వెంట రావాలి మరి!"

"సరేలే! నేనూ వస్తాననుకో. కాని నువ్వు మంచి అదృష్టవంతుడవోయ్. నా విషయమే గొడవగా ఉంది. ఆ మిస్ కామత్ లేదూ; ఆమె నిజంగానే నేను ప్రేమించాలని కలలు గంటున్నది. నే నేమో నాటకమాడుతున్నాను. కాని, ఆమె తనను నిజంగానే ప్రేమిస్తున్నానని భ్రమపడుతోంది. ఇప్పుడామె వ్యవహారం చూశావా; గర్వంతో భూమిమీద నిలవటం లేదు. కాని ఒక సంగతి. ఆ అమ్మాయి చాలా తెలివైంది. నే నామె స్వాధీనంలోనుండి జారిపోతానేమో అని భయం ఆమెకు. అందువల్లనే నన్ను చాలా మర్యాదచేస్తుంది. కృత్రిమ అలం కారాలతో సహజంగాఉన్న లోటును వీలైనంతవరకూ పూడ్చాలని విశ్వప్రయత్నం చేస్తుంది తగినంత ధనం లభిస్తే వివాహం చేసుకుంటే ఏమని ఆలోచిస్తున్నాను."

"ఆమెముఖం చూస్తేనే నీకు చెడ్డ్డమంటగాఉండేదిగా!" ఆశ్చర్యంగా అన్నాడు సంత్ కుమార్.

"ఔను! ఇప్పుడూ అంతే! కాని డబ్బు వగతొకటి చెప్పానుగా! డాక్టర్ గనుక యిరవై యిరవైఅయిదు వేలు గనుక ముట్టజెప్తే వివాహం చేసుకుంటాను. పెళ్ళిచేసుకున్నంత మాత్రాన ఆమె కేమీ అమ్ముడుపోవటం లేదుగా!"

మరుసటిరోజు మిత్రు లిద్దరూ తమ అభిప్రాయాలు దేవ కుమార్ ముందుంచారు. ఒక నిమిషంవరకూ దేవకుమార్ తన చెవులను తానే నమ్మలేకపోయినాడు. ఆయన తన జీవితం స్వతంత్రంగానూ, నిర్భయంగానూ, నిష్కపటంగానూ గడి పాడు. కళాకారుల్లో సహజంగా ఉండే ఒక విధమైన ఆత్మాభి మానం నిరంతరం ఆయనకు దిలాసా కలిగించేది. ఆయన కష్టాలు పడ్డాడు. పస్తులున్నాడు. అవమానాలు సహించాడు. కాని, తన హృదయాన్ని ఎన్నడూ కలుషితం చేసుకోలేదు. జీవితంలో ఎన్నడూ కోర్టుముఖమైనా చూడలేదు. "నాతో ఈ ప్రతిపాదన ఎలా చెయ్యగలిగావా అని బాధగా ఉంది. దీనికంటేకూడా యిటువంటి కుటిలపు ఆలోచన నీ హృదయంలో కలిగినందుకు మరింత బాధగా ఉంది"అన్నాడు దేవకుమార్.

"అవసరం అన్నీ నేర్పుతుంది. ఆత్మరక్షణ అనేది ప్రకృతిలో ప్రథమ నియమం. మీరు యిరవై వేలకు తిలో దకా లిచ్చిన ఆస్తి యివ్వాళ రెండు లక్షలకు తగ్గదు" నిస్సం కోచంగా అన్నాడు సంత్ కుమార్.

"అది రెండులక్షలు కాదు; పదిలక్షలు జేస్తే మటుకేం ? నా దృష్టి కది ఆత్మవిక్రయసమస్య. నాలుగు రూకలకోసం నేను నా ఆత్మ నమ్ముకోలేను."

మిత్రులిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూచుకుని చిరునవ్వు నవ్వుకున్నారు. ఎంత పురాతనమైన తర్కం! ఎంత పనికిమాలిన తర్కం! అసలా ఆత్మ అనే పదార్థం ఎక్కడున్నది. ప్రపంచ మంతా సచ్చిమోసంమీద నడుస్తుంటే యింకా "ఆత్మ" ఎక్కడుంది ? వందగూపాయ లప్పుపెట్టి వెయ్యిరూపాయలు

గుంజటంఅధర్మంకాదూ? చచ్చీచావకుండా పస్తులతో మలమల మాడే లక్షమంది కార్మికుల శ్రమఫలితం దోచుకుని, ఒక్క పెట్టుబడిదారు భోగవిలాసాలలో తులతూగటం అధర్మం కాదూ! ఒక పురాతనమైన కాగితపు అగ్రిమెంటు రద్దుకు ప్రయత్నించటం మాత్రం అధర్మ మౌతుందన్న మాట!

"మీ రిది ఆత్మవిక్రయ మనుకున్నా సరే చేసితీరాలి. ఇదితప్ప మరో మార్గంలేదు. అదీగాక మీ రీ విషయాన్ని యిలాంటి దృక్పథంతో చూస్తారెందుకూ? సంఘానికి క్షేమకర మైనదే ధర్మం. సంఘానికి నష్టంకలిగించేదే అధర్మం. ఈ పని వల్ల సంఘానికి కలిగే మహోపకార మేమిటో సెలవిస్తారా?" కటువుగా అన్నాడు సంత్‌కుమార్.

"సంఘం తన కట్లుబాట్లమీద ఆధారపడిఉంది. ఆ కట్టు బాట్లను బద్దలుచేస్తే యిక సంఘం అంతరించిం దన్నమాటే!" సావధానంగా అన్నాడు దేవకుమార్.

ఇరువైపులా తర్కవితర్కాలు చెలరేగినాయి. దేవ కుమార్ సాంప్రదాయాలూ, సిద్ధాంతాలూ, ధర్మసూత్రాలూ వల్లిస్తున్నాడు. కాని, ఈ యువకు లిద్దరి వాదనలముందూ ఆయన యే యుక్తీ నిలబడలేకపోయింది. ఆయన తన నెరసిన గడ్డాన్ని చేతితో దువ్వుకుంటూనూ, బట్టతలను గోక్కుంటూనూ ఎన్నో దృష్టాంతాల నిస్తున్నాడు. కాని, ఈ యువకు లిద్దరూ వా టన్నిటినీ చిటికెలువేస్తూ దూదిపింజలక్రింద ఎగరగొట్టేస్తు న్నారు.

"బాబుగారూ! తమరు మాట్లాడేది ఏ కాలపుమాటలో అర్థం కావటంలేదు. చట్టంవల్ల మనం పొందగలిగిన ప్రయో

జనమంతా పొందితీరాలి. ప్రయోజనం పొందగలందుకే ఆ సెక్షనులన్నీ ఉద్దేశించబడ్డాయి. ఈ మధ్యనే వడ్డీవ్యాపారుల నుండి జమీందార్ల ప్రాణాలు నిలబెట్టటానికి ప్రభుత్వం చట్టం చేసిన విషయం మీకూ తెలుసు. దాని ఫలితంగా ఎన్ని జాగీర్లు తిరిగి జమీందార్లకు సంక్రమించాయి? తమ రిది అధర్మమే నంటారా? చట్టసంబంధమైన సాధనాలద్వారా మనం నెరవేర్చుకోగల్గిన పనులన్నీ నెరవేర్చుకోటమే లాకికానికి అర్థం. ఇందులో నా కొచ్చేదీ, పొయ్యేదీ ఏమీ లేదు. నా కే స్వార్థమూ లేదు. సంత్ కుమార్ నా మిత్రుడు. ఇందువల్ల నే తమ కీ విన్నపం చేస్తున్నాను. అంగీకరించటం, అంగీకరించక పోవటం మీ యిష్టం" నిర్మొగమాటంగా అన్నాడు సిన్హా.

"అయితే యింతకూ నే నేం చెయ్యాలనీ మీ రనేదీ!" గత్యంతరం తోచక అన్నాడు దేవకుమార్.

"ఏముందీ! మేము చేసేపనికి విరుద్ధంగా తమ రేమీ చెయ్యకుండా ఉంటే అంతేచాలు."

"సత్యం ఖూనీ ఔతుంటే నేను సహించ లేను."

"ఐతే మీరు నా చావు కళ్ళచూడవలసుంటుంది" కండ్లు పెద్దవిచేసి ఉద్రేకస్వరంతో అన్నాడు సంత్ కుమార్.

సిన్హా సంత్ కుమార్ ను గదమాయిస్తూ అన్నాడు – "అనవసరమైన మాట లెందుకు సంత్ కుమార్! బాబుగారికి రెండుమూడు రోజులు ఆలోచించుకునేందుకు అవకాశమివ్వూ! ఇంకా నువ్వు తండ్రివి కాలేదు. కొడుకంటే తండ్రి కెంత ప్రాణమో ఏం తెలుస్తుంది నీకూ! ఆయ నిప్పు డెంత కాదన్నా దావా దాఖలుచేసిన తరువాత, ఆయ నేం చేస్తారో చూడు.

మరి!... మా ఫిర్యాదేమనంటే బాబుగారూ! తమరు విక్రయదస్తావేజు వ్రాసేటప్పుడు తమ మానసిక పరిస్థితి సరిగా లేదనీ, యిప్పుడుకూడా అప్పుడప్పుడు తమ మతి భ్రమిస్తూనే ఉంటుందనీ...భారత దేశంలాంటి ఉష్ణ దేశంలో ఈ వ్యాధి అనేక మందికి కలుగుతూనే ఉంటుంది. తమకు కూడా కలిగిందంటే అందులో ఆశ్చర్య మేమీ ఉండదు. మేము సివిల్ సర్జన్ చేత ఈ విషయంలో సాక్ష్య మిప్పిస్తాం."

"నేను జీవించివుండగా ఈ దుర్మార్గం జరగటానికి వీల్లేదు. నే నెంతమాత్రం అంగీకరించను. నేను చేసిన పనేదో బాగా ఆలోచించినమీదటే చేశాను; పరిస్థితుల వత్తిడివల్ల చేశాను. నే నందుకు ఎంతమాత్రం విచారపడటం లేదు. మీరు ఈ రకమైన దావావేశారంటే అన్నిటికంటె తీవ్రమైన ప్రతిఘటన నా నుండే యెదుర్కొనవలసివొస్తుంది. నేను స్పష్టంగా చెబుతున్నా నీ విషయం" ఏవగింపుగా అన్నాడు దేవకుమార్. అని ఉద్రేకంతో గదిలో అటూ యిటూ తిరుగ సాగాడు.

సంత్ కుమార్ కూడా లేచి నుంచున్నాడు. "అయితే యిదిగో! మీరు నా ఛాలెంజీకూడా వినండి. మీరు తమ ధర్మరక్షణో లేక నా ప్రాణరక్షణో ఏదో ఒకటే చెయ్య గలుగుతారు. మీరు మళ్ళీ నా ముఖం చూడబోరు" బెదరిస్తూ అన్నాడు.

"భార్యకంటే, బిడ్డలకంటేకూడా నాకు నా ధర్మమే ప్రియమైంది."

సంత్ కుమార్‌ను ఆజ్ఞాపిస్తూ అన్నాడు సిన్హా—"వారి మానసికపరిస్థితిలో మార్పు కలిగించటనీ, ఈ పరిస్థితిలో ఆయన ఏంచేస్తారో తెలియదుగనుక, ఆయన్ను తమ స్వాధీనంలో ఉంచుకోమని యివ్వాళ పిటీషను పెట్టేసెయ్."

"అయితే నేను పిచ్చివాణ్ణా!" పిడికిలి బిగించి క్రోధావేశంతో ప్రశ్నించాడు దేవకుమార్.

"ఔను తమరు పిచ్చివారే? తమ మెదడు ఆర్డరులో లేదు. పిచ్చివాళ్లే యిలా మాట్లాడుతుంటారు. ఎవరినైనా కరవడానికి ఉరికేవాడుకాదు పిచ్చివాడు; మామూలు మనుష్యుల ప్రవర్తనకు విరుద్ధంగా ప్రవర్తించటంకూడా పిచ్చే."

"అసలు మీరే పిచ్చివాళ్ళు."

"ఆ నిర్ణయంచేసేది డాక్టరు."

"నేను డజనుల పుస్తకాలు వ్రాశాను. వేల ఉపన్యాసాలిచ్చాను. ఇది పిచ్చివాళ్ళ పనేనంటారా?"

"చిత్తం! ఆదంతా పచ్చిఉన్మాదులపనే. రేపే తమనీ యింట్లో త్రాళ్ళతో కట్టివెయ్యటం జరుగుతుంది."

"మీరు ముందు నా యింట్లో నుంచి వెళ్లిపోండి. లేకుంటే తుపాకీతో కాల్చిపారేస్తాను."

"అచ్చగా పిచ్చివాళ్ళ బెదరింపే! సంత్ కుమార్! ఆ దరఖాస్తులో వారి తుపాకీ స్వాధీనం చేసుకోవలసిందనీ, లేకుంటే ప్రాణాపాయమనికూడా వ్రాయి."

తరువాత మిత్రు లిద్దరూ లేచి వెళ్ళిపోయినారు. దేవకుమార్ ఎన్నడూ పట్టుపు వలలో చిక్కుకున్నవాడు కాదు. ప్రకాశకులూ, పుస్తకవిక్రేతలూ ఆయన్ను అనేకసార్లు మోసం

చేశారు. కాని ఆయ నెప్పుడూ చట్టాన్ని ఆశ్రయించలేదు. ఆయన జీవిత పంథా యిది-తాను మంచివాడైతే లోకమంతా మంచిదే! ఆయన అన్నివేళలా ఈ నీతినే పాటించాడు. కాని ఆయన అమాయకుడుగానీ, పిరికిపందగానీ కాదు. ముఖ్యంగా సిద్ధాంత విషయంలోమాత్రం రాజీఅంటే ఏమిటో ఎరుగడు. ప్రపంచం తల్లక్రిందులైనాసరే ఆయన ఈ కుట్రలో మాత్రం భాగస్వామి కాడు. కాని వీళ్ళంతా ఏకమై నిజంగానే ఆయన పిచ్చివాడని రుజువుచేస్తారా? సిన్హా బెదరింపులో ఉన్న గట్టితనం నిర్లక్ష్యంచెయ్యదగింది కాదు. ఆయన పోకడ చూస్తే యిలాంటి ఎత్తుగడలలో బాగా ఆరితేరినవాడని తోస్తుంది. బహుశా డాక్టర్లను ఆకట్టుకుని నిజంగానే ఆయన్ను పిచ్చివాడని రుజువుపరుస్తారేమో! ఆయన ఆత్మాభిమానం గర్జించింది— ఊహుఁ! ఎన్ని కష్టాలు పడవలసివచ్చినాసరే ఆయన అసత్యాన్ని ఆశ్రయించడు. డాక్టర్లుమాత్రం అంత గ్రుడ్డివాళ్లా? ఆయన్ను ప్రశ్నించరూ? ఆయనతో సంభాషించరూ? ఏమీ చెయ్యకుండానే పిచ్చివాడని వ్రాసిపారేస్తారా? ఆయన మానసిక పరిస్థితిలో లోటు ఏర్పడిన లక్షణా లెక్కడా కని పించటంలేదు. ఇదేమిటి! ఆయనకూడా ఈ కుట్రవాళ్ళ జిత్తుల్లో పడిపోయినాడే! ఆయనకు తన ప్రవర్తనలో పరివర్త నేమీ కనపడటంలేదు. ఆయన బుద్ధి సూర్యుని ప్రకాశంవలె నిర్మలంగా ఉంది. ఎన్నటికీ జరగదలా. ఈ కుట్రకుంకల బెదరింపుల కాయ నేమీ లొంగడు.

కాని సంత్‌కుమార్‌కు ఈ స్వభావం ఎలా అబ్బిందా అని ఆయన మనస్సు మథనపడిపోతోంది. ఆయనకు తన తండ్రి

గుర్తుకొచ్చాడు. ఆయ నెంత సౌమ్యుడూ. సత్యవ్రతుడూ! ఆయన మామగారు వకీలేమరి. కాని ఎంత ధర్మబుద్ధి! తా నొక్కడు సంపాదించి కుటుంబాన్నంతా పోషించేవాడు. అన్నదమ్ము లైదుగురి కుటుంబభారమూ ఆయ నొక్కడు భరించేవాడు. తన కొడుకులూ, కూతుళ్ళ విషయంలో ఏ విషయంలోనైనాసరే పక్షపాతం చూపాడని, ఎవ రనగల రాయన్ను! అన్నగారు భోజనం చేస్తేగాని ఆయన అన్నం ముట్టేవారు కాదు. అటువంటి వంశంలో సంత్ కుమార్ లాంటి దగాకోరు ఎక్కడనుండి దాపురించాడు! తాను అక్రమంగా ప్రవర్తించిన సందర్భం ఒక్కటికూడా ఆయనకు గుర్తు రావటం లేదు.

అలాంటప్పుడీ చెడ్డపేరు సహించట మెలా? తనఇంట్లోనే ఆయన చైతన్యం కలిగించలేకపోతే, ఒకవిధంగా ఆయన జీవిత మంతా వ్యర్థమైందన్నమాటే. తన కత్యంత సన్నిహిత సంపర్కంలో ఉన్నవాళ్ళనే మానవులుగా మార్చలేకపోతే, జీవిత పర్యంతం చేసిన తన సాహిత్యసేవతో ఎవరిని ఉద్ధరించినట్లు? ఈ దావా దాఖలైన తరువాత, తన ముఖ మిక లోకాని కెలా చూపించగలుగుతాడు? ఆయన ధనం సంపాదించలేదు. కాని కీర్తిమాత్రం ఆర్జించాడు. అదికూడా తనకు దక్కకుండా పోతుందా; ఆయనకు తన ఆత్మసంతృప్తి కేమాత్రంకూడా మిగలదా? ఇంతటి ఆవేదన ఆయన ఎన్నడూ అనుభవించ లేదు.

ఇదంతా శైవ్యాకు చెప్పి, తను ఆమెకుకూడా వ్యధ కలిగించట మెందుకూ? ఆమె సుకమార హృదయాన్ని గాయ

పరచటమెందుకూ? ఆ దుఃఖమంతా తానే సహిస్తాడు. దుఃఖపడుతున్నాననుకోవటంమాత్రం దేనికీ? అనుభవాలకు మరో పేరే జీవితం. ఇదీ ఒక అనుభవమౌతుంది. కాస్త యిది కూడా అనుభవిద్దాంలే.

ఈ భావం కలుగగానే ఆయన మనస్సు తేలికపడ్డది. ఇంట్లోకి వెళ్ళి పంకజను టీ తయారుచేయమన్నాడు.

"సంత్ కుమార్ ఏమిటీ అంటున్నాడూ?" ప్రశ్నించింది శైవ్యా.

"ఏముంది! ఆ పాతపిచ్చే!" తన సహజ మందహాసంతో అన్నాడాయన.

"మీరు దేనికీ అంగీరించలేదుగదా?"

తన భార్య అనుకూలతను అర్థంచేసుకుని అన్నాడు దేవకుమార్—"ఎన్నటికీ అంగీకరించను."

"వీడి పుర్రికీ బుద్ధి ఎలా పుట్టిందో?"

"సామాజిక సంస్కారమే! ఇంకెలా పుట్టుందీ!"

"వీడి సంస్కారమే యిలా ఎందుకు కావాలీ? సాధూ లేడూ? పంకజ లేదూ? లోకంలో ధర్మమే నశించిపోయిందా?"

"మరీ మెజారిటీ యిలాంటివాళ్ళదే! ఇదిమాత్రం తెలుసుకో."

ఆరోజునుండీ దేవకుమార్ షికారుకెళ్ళటంకూడా మానేశాడు. రాత్రింబవళ్ళు బయటికి ముఖం చూపకుండా యింట్లోనే కూర్చుండిపొయ్యేవాడు. కళంకమంతా తనకే అంటినట్లుగా ఉందాయనకు. నగరంలోనూ, చుట్టుప్రక్కలా ఉండే ప్రము

ఖులూ, మేధావంతులూ అయినవాళ్ళందరితోనూ ఆయనకు స్నేహమే అందరూ ఆయన మంచితనాన్ని గౌరవించేవాళ్ళు. దావా దాఖలైనాసరే బహుశా ఆయ నేమీ జోక్యం కల్గించుకోరా అనిపిస్తోంది. కాని ఆయన హృదయం కలవరపడుతూనే ఉంది. తన అహంభావంవల్ల తన ఆప్తులైనవా రందరి మంచి చెడ్డలకూ తానే బాధ్యు డనుకుంటున్నా డాయన. లోగడ సూర్యగ్రహణ సందర్భంలో సాధుకుమార్ వెల్లువగా ప్రవహించే నదిలో దూకి, మునిగిపోతున్న ఒకవ్యక్తి ప్రాణం రక్షించాడు. అప్పు డాయనకు ఆ కీర్తి యావత్తూ తానే పొందినప్పటికంటేకూడా మించిన ఆనందం కలిగింది. ఆయన కళ్ళల్లో నీళ్లు నిండినాయి. ఆయన మస్తకం మరింత ఉన్నతమైనట్లూ, ముఖం తేజోవంతమైనట్లూ తోచింది. ఆ ప్రజలే సంత్ కుమార్‌ను రకరకాలుగా విమర్శిస్తుంటే, ఆయ నెలా వినగల్గుతాడు ?

ఈ విధంగా ఒక నెల జరిగిపోయింది. సంత్ కుమార్ దావా దాఖలుచేయలేదు. అటు సివిల్ సర్జన్‌ను లోబరుచుకోవాలి; ఇటు మిస్టర్ మల్లిక్‌ను కూడగట్టుకోవాలి. సాక్షుల్ని సిద్ధపరుచుకోవాలి. ఈ ఏర్పాట్లలోనే రోజులన్నీ గడిచిపోయినాయి. ఇంకా పైకం వ్యవహారం ఉండనేఉంది. దేవకుమార్ సహకరిస్తే అన్నిటికంటె పెద్దదైన ఈ బాధ తప్పిపోయేది. కాని ఆయన ప్రాతికూల్యం సమస్యను మరింత క్లిష్టం చేసింది. సంత్ కుమార్ అప్పుడప్పుడు నిరాశపడేవాడు. ఏం చెయ్యటానికీ తోచేదికాదు. మిత్రులిద్దరూ దేవకుమార్ పైన పండ్లుకొరుకుతూ ఉండిపొయ్యేవాళ్ళు.

"ఈయన్ను తుపాకితో కాల్చిపారేద్దా మనిపిస్తుంది. ఈయన నాకు తండ్రి కాదు. శత్రువనిపిస్తోంది" అనేవాడు. సంత్ కుమార్.

"నా హృదయంలోమటుకు ఆయనంటే ఎంతో గౌరవం ఏర్పడుతోంది. తన స్వార్థంకోసం మానవుడు నీచాతినీచమైన పనికూడా చేస్తాడు. కాని త్యాగధనులనూ, సత్యవాదులనూ హృదయంలోమాత్రం గౌరవిస్తూనే వుంటాడు. ఆయనమీద నీ కింత క్రోధ మెలా కలుగుతుందో అర్థంకావటం లేదు. సత్యం కోసం ఎన్ని కష్టాలనైనా సహించగల వ్యక్తి పూజ్యుడన్నది గుర్తుంచుకో" నచ్చచెప్పేవాడు సిన్హా.

"ఇటువంటి మాటలతో నన్ను మరింత మండించబోకు సిన్హా! నీవు పూనుకుంటే ఆ మహాత్ముడీ పాటికి పిచ్చి ఆసుపత్రిలో ఉండేవాడే. నీ వింత భావుకుడవన్న విషయం నాకు తెలియదు."

"ఆయన్ను పిచ్చి ఆసుపత్రికి పంపటం ను వ్వనుకున్నంత తేలిక కాదు. ఆపని చెయ్యవలసిన అవసరమూ లేదు. మనం రుజువు చెయ్యదలచుకుంది విక్రయ దస్తావేజు వ్రాసినప్పుడు ఆయన తన స్వాధీనంలో లేడని. ఇందుకు సాక్షులు కావాలి. ఆ విషయం యిప్పటికీ అనుకూలపడ లేదు. ఆ విషయం రుజువు చెయ్యటానికి డాక్టరు కావాలి. మిస్టర్ కామత్ కూడా అలా వ్రాయటానికి సాహసించటం లేదు."

పండిట్ దేవకుమార్‌ను బెదరింపులతో లొంగదీయటం అసంభవం. కాని తర్కానికిమాత్రం తనంతట తానే లొంగి పోయేవాడు. ప్రస్తుతం ఆయన ఆలోచిస్తున్న సమస్య ప్రపం

చంలో యీ అవినీతికీ, అరాజకానికీ కారణ మేమిటా అనే కర్మ సంస్కారం. వీటి ఆధారంతో ఆయన కేమీ అంతు చిక్కటం లేదు. ఆత్మపదార్థమంతా ఒకటే ననే సర్వాత్మవాదంకూడా ఆయన సందేహం తీర్చలేదు. ప్రపంచమంతా ఒకే ఆత్మ స్వరూపమైతే మరి యీ భేదా లేమిటి? జీవితమంతా పేగులు తెంచుకు పాటుపడ్డా, ఆకలితో మలమల మాడుతున్నా డొకడు. కాలుమీద కాలు వేసుకు కూర్చున్నా, పూలపాన్పుపై పొర్లాడుతున్నాడు మరొక వ్యక్తి. ఇది ఆత్మవాదమా? ఘోరాతిఘోరమైన అనాత్మవాదమా? బుద్ధిలా జవా బిచ్చేది — యిక్కడ అందరూ స్వతంత్రులే. అందరికీ తమ శక్తిసామర్థ్యాల ననుసరించి అభివృద్ధి అయ్యేందుకు అవకాశా లున్నాయి. కాని అనుమానం ప్రశ్నించేది — అందరికీ సమాన అవకాశాలు యెక్కడ ఉన్నాయి? మార్కెటు ఏర్పాటుచేశారు. తన యిష్టం వచ్చిన వస్తువు ఏది కావాలంటే అదే కొనుక్కోవచ్చు మార్కెటులో. కాని కొనే దెవరు? చేతిలో పైసా లున్నవాడేగా! మరి అందరివద్ద ఆ పైసాలు లేనప్పుడు అందరికీ సమానమైన అధికారాలున్నా యంటే ఎలా నమ్మటం? ఇలాంటి తీవ్రమైన మానసిక సంఘర్షణ ఆయన జీవితంలో యెన్నడూ జరుగలేదు. ఆయన సాహితీ మేధస్సు, యిటువంటి వ్యవస్థతో సంతృప్తిపడటమే అసంభవం. కాని ఈ సమస్యను వ్యక్తిగత పరాకాష్ఠవరకూ తీసుకెళ్ళవలసి నంతటి చిక్కు ఆయన కెప్పుడూ కలుగలేదు. ఇప్పు డాయన పరిస్థితి, నిత్యం మార్గంలో పడివుండే యిటుకరాళ్ళ గుట్టలను చూస్తూగూడా, వాటిని తప్పించుకు నడిచే వ్యక్తిని పోలి వుంది.

ఆ యిటుకరాళ్ళవల్ల రాత్రిపూట ఎంతమందికో దెబ్బలు తగులుతూవుంటాయి. ఎందరికో కాళ్ళూ, చేతులూ విరుగు తుంటాయి. కాని ఆ విషయం తప్పించుకుతిరిగే వ్యక్తి కేమీ పట్టదు. కాని ఒకరోజు ఆ ఎదురుదెబ్బ తనకే తగిలి మోకాళ్ళు పగలటం జరిగినప్పుడు, అతని తప్పించుకు తిరిగే తత్వం ఎదురు తిరుగుతుంది. అప్పుడా వ్యక్తి ఆ రాళ్ళకుప్ప మొత్తం దారిలో నుండి లాగిపారవేయటానికి సిద్ధమౌతాడు. దేవకుమార్ కు తగిలిన దెబ్బలాంటిదే. ఎక్కడుంది న్యాయం? ఏదీ న్యాయం? ఒక పేదవాడు ఏ చేలోనో కంకులు నల్చుకుతింటాడు. చట్టం అతన్ని శిక్షిస్తుంది. మరి శ్రీమంతుడు పట్టపగలే యితరులను దోపిడీ చేస్తాడు. కాని అతనికి బిరుదులు లభిస్తాయి. సన్మా నాలు జరుగుతాయి. కొంతమంది రకరకాల ఆయుధాలతో వచ్చి అమాయకులూ, బలహీనులూ అయిన కూలిజనంమీద అత్యాచారాలుచేసి, తమ బానిసలుగా చేసుకుంటారు. భూమి పన్నునీ, వృత్తిపన్నునీ, బండిపన్ననీ ఎన్నెన్ని పేర్లతో కొల్ల గొడుతుంటారు జనాన్ని! కాని తామేమో వందల, వేల జీతాలు కాజేస్తారు. వేటాడుతారు డ్యాన్సులు చేస్తారు. భోగ విలాసాల్లో కులుకుతారు. భగవంతుడు సృష్టించిన ప్రపంచం యిదేనా? ఇదేనా మరి న్యాయం?

నిజమే! మహాత్ములు అన్ని కాలాల్లోనూ ఉంటారు. ఉన్నారు కూడాను. వారి కిప్పటికీ ప్రపంచం ధర్మానికీ, నీతికీ కట్టుబడే నడుస్తున్నట్లుగా కనబడుతుంది. వాళ్ళు తమ జీవితా లను ఆహుతిచ్చి ఈ లోకంనుండి సెలవు పుచ్చుకుంటారు. కాని వాళ్ళు మహాత్ములెలా ఔతారు? వాళ్ళను పిరికిపంద లనాలి;

స్వార్థపరు లనాలి ; కుక్షింభరులనాలి. న్యాయరక్షణకు ప్రాణా లర్పించేవాళ్ళే మహాత్ములు. తెలిసికూడా అజ్ఞానంగా తయారైనవాడు ధర్మపతితుడౌతాడు. అతని దృష్టికి దుష్టవ్యవస్థ నికృష్ట మనిపించకపోతే ఆ వ్యక్తి అంధుడే కాదు ; మూర్ఖుడు కూడాను. అంతేకాని మహాత్ము డెంతమాత్రం కాదు. అయినా యిక్కడ మహాత్ముల అవసరమేమీ లేదు. అదృష్టమనీ, దేవుడనీ, భక్తి అనీ కల్లబొల్లి కల్పనలు వ్యాపింపజేసి, ఈ అవినీతికి అమృతంపోసిం దీ మహాత్ములే. మానవుడీపాటికి ఈ అవినీతినో లేక ఈ పరిస్థితుల్లో అంతరించటమే యింతకంటే మేలనిపించే ఈ సంఘాన్నో నిర్మూలిస్తే బాగుండును ! కాదు ! కాదు ! మానవుల్లో మానవుడు రూపొందాలి. క్రూరమృగాలమధ్య వాటితో పోరాటానికి ఆయుధాలు ధరించాలి. క్రూరమృగాల పంజా దెబ్బల కెరగావటం మహత్వంకాదు ; మూర్ఖత్వం. ఇవ్వాళ ఈ జాగీరుదారులూ, మహారాజులూ తమ తాత ముత్తాతల దోపిడీ సొత్తుతోనే ఆనంద మనుభవిస్తున్నారు. అయితే ఆయన ఆస్తినంతా అమ్మటం పిచ్చిపని కాదూ మరి? పితరులకు పిండం వెయ్యటంకోసం గయకు వెళ్ళటం ; మళ్ళీ అక్కడి నుండి వచ్చి వేలు ఖర్చుపెట్టటం ఏమంత అవసరం ? రాత్రులు మిత్రులతో కలిసి వేశ్యల పాటకచ్చేరీలలో గడపటం, నాటక సమాజాలు స్థాపించి, వేలకువేలు అందులో తగలబెట్టటం యివన్నీ అనివార్యమైన విషయాలా? అది తప్పకుండా ఉన్మాదమే. ఆయనకు తన పిల్లలనుగురించి ఆలోచన ఎందుకు కలుగలేదూ? ఆయనకు తేరగాఆస్తిలభించింది; అనుభవించాడు ఏం ? ఆయన కొడుకులుమాత్రం తేరసొత్తు ఎందు కనుభవించ

గూడదూ ? తన యౌవనోత్సాహాలను ఆయన అరికట్టుకో లేకపోయినాడే ; మరి ఆయన కొడుకులు తప్పెందుకు చెయ్యాలి ?

"ఈ అవినీతిపూరిత ప్రపంచంలో ధర్మాధర్మాల విచక్షణ శుద్ధతప్పు; ఆత్మహత్యాకరం." చివరకు ఆయన సందేహాలన్నిటికీ ఈ దృఢనిశ్చయంతో ఓదార్పు కలిగింది. చట్టసంబంధమైన ఎత్తుగడలతో ఆస్తి సంపాదించటంలో ఉన్నంత మంచీ లేక చెడ్డా – జూదమాడిగానీ, పశుల దురాశా, వ్యామోహాలను ఉపయోగించుకునిగానీ ఆస్తిసంపాదించడంలోగూడాఉన్నాయి. ఆ వడ్డీవ్యాపారికి నిజంగా నేతా నొక యిరవై వేల రూపాయలు బాకీపడ్డాడు. ఆ ఆస్తి అమ్మివేసి, అతని యిరవై వేల రూపాయలు అతనికి చెల్లించగా, మిగిలిన సొమ్మంతా ఆయనకు లభించటం న్యాయం. నీతి వక్కాణించే దిదే. చట్టం రుణపీడితుల ఎడల ఈ మాత్రమైనా న్యాయం చూపనప్పుడు, రుణపీడితులు కూడా చట్టంలో ఉన్న పేచీలన్నీ ప్రయోగించి, వడ్డీవ్యాపారి నుండి తిరిగి తమ ఆస్తిని రాబట్టుకునేందుకు ప్రయత్నించవలసిందే. అందులో అధర్మానికి పాలుపడటం అంటూ ఏమీలేదు. శాస్త్రమూ, నీతీ, వీటికి సంబంధించిన ప్రతి కోణంనుండీ పరిశీలించిన పిమ్మటే ఈ నిర్ధారణకు వచ్చాడు దేవకుమార్. అది ఆయన హృదయంలో బాగా నాటుకుపోయింది. ఇక ఆయన ఎంతమాత్రం చలించడు. దీని ఫలితంగా చిరకాలంనుండీ ఆయనలో నాటుకుపోయిన సంస్కారాలకు ప్రమాదం వాటిల్లుతున్నప్పటికీ, ఆయనకు నవజీవన సాధన కేదో తారకమంత్రం లభించిందా అన్నంత ఆనందంతో ఉప్పొంగిపోయాడు.

"తమరు నా ఆస్తి తిరిగి యిచ్చివేయకపోతే నా కుమారులు తమమీద దావా వేస్తారు" ఒకరోజు సేఠ్ గిరిధరదాస్ వద్దకు వెళ్ళి స్పష్టంగా చెప్పేశాడు దేవకుమార్.

గిరిధరదాస్ నవయుగానికి చెందినవ్యక్తి. ఆంగ్లభాషలో దిట్ట. చట్టసంబంధమైన విషయాల్లో ఆరితేరినవాడు. రాజకీయాల్లోకూడా పాల్గొంటాడు. కంపెనీల్లో షేర్లుకొంటాడు. మార్కెట్టు గిట్టుబాటుగా ఉండటం కనిపెట్టి మరీ వ్యాపారం చేస్తాడు. ఒక పంచదారమిల్లు అచ్చంగా తనే నడిపిస్తున్నాడు. వ్యాపారమంతా యింగ్లీషువాళ్ళ పద్ధతుల్లో నడిపిస్తాడు. ఆయన తండ్రి మక్కూలాల్‌గూడా ఈ పనులన్నీ చేసేవాడే. కాని పూజలూ, పునస్కారాలతోనూ, దానధర్మాలతోనూ ప్రాయశ్చిత్తం చేసుకునేవాడు. కాని గిరిధరదాస్ పచ్చిభౌతికవాది. ప్రతిపనీ వ్యాపారఫక్కీలో చేసేవాడు. గుమాస్తాలకు జీతం ఫస్టు తేదీకల్లా యిచ్చేసేవాడు. కాని మధ్యలో ఎవరికైనా డబ్బు అవసరం కలిగితే వడ్డీకిచ్చేవాడు. మక్కూలాల్ సంవత్సరమంతా జీతమేయిచ్చేవాడుకాదు. కాని గుమాస్తాలకు ఎప్పుడూ అడ్వాన్సుగా యిస్తుండేవాడు. లెక్కచూచుకుంటే వాళ్ళకు యివ్వవలసి రావటానికి బదులు తిరుగు వస్తుండేది. మక్కూలాల్ సంవత్సరానికి రెండు మూడుసార్లు అధికారుల దర్శనానికి వెళ్ళేవాడు. పూలబుట్టలూ, పళ్ళబుట్టలూ సమర్పించుకునేవాడు. చెప్పులు విడిచి మరీ గదిలోకి వెళ్ళేవాడు. చేతులు కట్టుకు నిలబడేవాడు. తిరిగి వచ్చేటప్పుడు అక్కడి నౌకర్లకు రెండు మూడు రూపాయలు మామూళ్ళిచ్చేవాడు. గిరిధరదాస్ మునిసిపల్ చైర్మన్. సూటూ బూటూ ధరించి అధికారుల

వద్దకు వెళ్ళేవాడు. సమానహోదాలో వ్యవహరించేవాడు. తనను యాచించినవారిని ఎంతో దయగా చూచేవాడు. పండుగలకు యినాము లిచ్చేవాడు. అవికూడా తనను బాగా పొగిడించుకున్నతర్వాతనే. తన హక్కులకోసం పోరాడటం, ఆందోళన చెయ్యటం ఎలాగో తెలుసు. ఆయన్ను మోసగించటం అసంభవం.

దేవకుమార్ కథనం విని, గిరిధరదాస్ విభ్రాంతుడైనాడు. ఆయనకు దేవమార్ నెంతో గౌరవించేవాడు. ఆయన పుస్తకాలు చాలా చదివాడు. ఆయన రచనల మొత్తం సెట్టు ఒకటి ఆయన గ్రంథాలయంలో ఉన్నది. ఆయన హిందీ భాషాభిమాని. అనేకమార్లు నాగరీ ప్రచారిణీసభకు భూరి విరాళా లిచ్చిఉన్నాడు. పురోహితులూ, పూజారులంటే మండిపడేవాడు. అసహ్యాకరమైన దానధర్మాల సాంప్రదాయం పైన ఒక కరపత్రంకూడా అచ్చువేయించాడు. ఉదారమైన భావాలు కలవాడని నగరంలో ఎంతో ప్రతీతి. మక్కూలాల్, స్థూలకాయుడవటంవల్ల, తన చోటునుంచి చురుకుగా కదలగలిగేవాడు కాదు. కాని గిరిధరదాస్ గట్టిమనస మనిషి. నగర వ్యాయామశాల ముఖ్యుడేగాక బలవంతుడూ, మంచి విలుకాడుకూడాను!

ఒక నిమిషంవరకూ ఆయన దేవకుమార్ ముఖంవంక చూస్తూ ఉండిపోయినాడు. ఆయన ఉద్దేశ మేమిటో అర్థమే కాలేదు గిరిధరదాస్‌కు. మళ్ళీ యిలా అనుకున్నాడు, పాపం ఆర్థిక చిక్కులతో బాధపడుతున్నాడు. అందుకనే మతికూడా చెడిపోయినట్లుంది. కాబట్టే అవకతవగా మాట్లాడుతున్నాడు.

దేవకుమార్ ముఖంలో ప్రస్ఫుటించే విజయగర్వం చూచిన తరువాత ఆయన అభిప్రాయం మరింత బలపడింది.

తన బంగారు కళ్ళజోడు తీసి మేజామీద ఉంచి పరిహాసంగా అన్నాడు – "ఏమండీ! యింట్లో అంతా కులాసాగా ఉన్నారా?"

"చిత్తం! చిత్తం! అంతా తమ దయ" ద్వేషభావంతో అన్నాడు దేవకుమార్,

"పెద్దబ్బాయి'లా' ప్రాక్టీస్ చేస్తున్నాడుకదూ?"

"చిత్తం!"

"కాని ప్రాక్టీసు బాగా సాగటంలేదుకాబోలు! పాపం తమ పుస్తకాలుకూడా ప్రస్తుతం బాగా ఖర్చవుతున్నట్టులేదు. తమవంటి సరస్వతీపుత్రుల నీ విధంగా అనాదరణగా చూడటం నిజంగా మన దేశ దురదృష్టం. తమరు యూరపులో నే జన్మించినట్లయితే, యివ్వాళ లక్షల కధికారులయ్యేవారు."

"నేను ధనలక్ష్మి ఉపాసకుణ్ణి కాదన్న విషయం తమకూ తెలుసు!"

"పాపం!. తమరు ఆర్థికంగా యిబ్బందుల్లో నే ఉండుంటారు. తమరు నన్ను ఏ సాయం చెయ్యమన్నా చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను. తమవంటి ప్రతిభావంతులైనవారితో నాకు పరిచయ మున్నందుకు నే నెంతో గర్విస్తున్నాను. తమ కేదైనా సేవచెయ్యటమంటే అది నాకెంతో గౌరవమైన విషయం."

ఇటువంటి సందర్భాల్లో దేవకుమార్ అత్యంత వినయ మూర్తిగా మారిపోయేవాడు. భక్తి ప్రదర్శించీ, భూషించీ,

ఎవరైనా ఆయన సర్వస్వం హరించగలిగేవాళ్ళు. అటువం టప్పుడు ఒక లక్షాధికారి—అందులోనూ సాహిత్యప్రియుడైన వ్యక్తి—ఆయన్నింతగా గౌరవిస్తున్నాడంటే యింకేంకావాలి! అతనితో ఆస్తి వ్యవహారాలూ లేక లావాదేవీలూ, వీటిని గురించి సంభాషించటం సిగ్గుచేటనిపించింది దేవకుమార్‌కు.

"నన్నంత గొప్పవాణ్ణిగా భావించటంలో తమ ఉదార హృదయం వెల్లడౌతోంది" అన్నాడు దేవకుమార్.

"తమరు ప్రస్తావించేది ఏ ఆస్తి విషయాన్ని గురించో నాకర్థం కాలేదండీ" అన్నాడు గిరిధరదాస్.

"ఆఁ! అదేనండీ! సేఠ్ మకున్‌లాల్‌గారు నాచేత వ్రాయించుకున్నారే..." సంకోచిస్తూ అన్నాడు దేవకుమార్.

"సరె సరె! దాని విషయంలో ఏమైనా కొత్త సంగతు లున్నాయా?"

"ఆ వ్యవహారంలోనే పిల్లలు తమపై నేదో దావా వెయ్యబోతున్నారు. నే నెంతగానో నచ్చచెప్పాను. కాని వాళ్ళు వినటంలేదు. ఇందుకే నేను తమవద్దకు వచ్చాను. కొద్దో గొప్పో ముట్టజెప్పి రాజీపడండి; వ్యవహారం కోర్టు కెక్కటం బాగుండదు. అనవసరంగా ఉభయులూ పెద్ద చిక్కులో బడతారు."

సుకుమారం, ఔదార్యం చిందులాడే గిరిధరదాస్ వదనం కఠోరంగా మారిపోయింది. 'నాగరికత' అనబడే మెత్తల్లో దాగిన వడ్డీవ్యాపారపు వాడిగోళ్ళు యీ భయం సోకిన మరుక్షణమే పదునెక్కి భయంకరంగా బయటపడ్డాయి.

."తమరు నాకు చెప్పటంకోసం శ్రమపడి యింతదూరం రావలసిన అగత్య మేమీ లేదు. ఆ కుర్రవాళ్ళకే నచ్చచెప్పి యుండవలసింది" కోపాన్ని అణచుకుంటూ అన్నాడు.

"వాళ్ళకు నచ్చచెప్పటం అయిపోయింది."

"అయితే వెళ్ళి ప్రశాంతంగా విశ్రమించండి. నా హక్కుల కోసం ఎలా పోరాడాలో తెలుసు నాకు. వాళ్ళ పుర్రెలు "లా" చదివినందువల్ల ఏమైనా వేడెక్కి బాధపడుతుంటే, నా దగ్గర దానికి తగిన ఔషధముందిలెండి."

ఇక దేవకుమార్ సాహితీ సౌశీల్యం కూడా చలించకుండా ఉండలేకపోయింది. సమరాహ్వానాన్ని స్వీకరిస్తున్నట్టుగా అన్నాడు - "కాని ఆ యిలాకా యివ్వాళ రెండు లక్షలకు తక్కువ చెయ్యదని తమరు కొంచెం గుర్తుంచుకోవాలి."

"రెండు లక్షలు కాదు; పది లక్షలైనా సరే; దానితో తమ కేమీ సంబంధం లేదు."

"తమరు నా కిచ్చిందల్లా యిరవై వేలే."

"తమ రెప్పుడూ కోర్టుకు వెళ్ళినవారు కాకపోయినా, తమకీ మాత్రం 'లా' తెలు సనుకుంటాను. ఒకసారి విక్రయమై పోయిన వస్తువు చట్టప్రకారం తిరిగి ఏ ధరకైనా వాపసు యివ్వబడదు. తమ క్రొత్తసూత్రాన్ని అంగీకరిస్తే, యిక ఈ నగరంలో వడ్డీవ్యాపారులే కంటపడరు."

కొంతసేపటివరకూ తర్కవితర్కాలు సాగినాయి. కాట్ల కుక్కల్లాగా ఆ పెద్దమనుషు లిద్దరూ కాండ్రు కాండ్రు మంటూనూ, కొక్కిలించుకుంటూనూ, విదిలించుకుంటూనూ గడిపారు. చివర కిద్దరూ పోట్లాడుకోటం జరగనేజరిగింది.

"తమ రిలా తయారౌతారనుకో లేదు" ఉగ్రుడై అన్నాడు గిరిధరదాస్.

"నేనూ తమ స్వార్థపుబొజ్జ యింత అగాధమైందనుకో లేదు" చిత్తం పైకెత్తుతూ అన్నాడు, దేవకుమార్.

"తమరు సర్వనాశనానికి సిద్ధమౌతున్నారు."

"ఏమీ మునిగి పోలేదు లే".

దేవకూమార్ అక్కడినుండి వెళ్లిపోయినాడు. ఆ మాఘ మాసపు చీకటిరాత్రుల ఘోరమైన చలిలోకూడా చెమటపోస్తోం దాయనకు. ఇంత విజయగర్వం ఆయన జీవితంలో ఎన్నడూ కలుగలేదు. ఆయన తర్కంలో అనేక మందిని జయించాడు. కాని ఈ విజయం జీవితానికొక నూతన ప్రోత్సాహం లాంటిది.

ఆ రోజు రాత్రే సిన్హా, సంత్ కుమార్ లిద్దరూ మరొక మారు దేవకుమార్‌ను వత్తిడిచేసి చూడాలని నిశ్చయించు కున్నారు. ఇద్దరూ వచ్చి అలా నుంచున్నారో లేదో దేవ కుమార్ ప్రోత్సాహం నిండిన స్వరంతో అన్నాడు – "మీరింత వరకూ దావా దాఖలుచెయ్యలేదేం? అనవసరంగా ఎందుకీ జాగూ?"

నిరాశతో శుష్కించిన సంత్ కుమార్ హృదయంలో ఉత్సాహం తుఫానులాగా విజృంభించింది. అయితే భగవంతు డున్నాడా ఏమిటి? దేవుడంటే అతని కెన్నడూ విశ్వాసం కలుగలేదు. ఏదో దైవికశక్తి తప్పక ఉండితీరాలి. బిచ్చమడగ టానికి వస్తే కోరినవరం లభించింది.

"మీ అనుమతికోసమే ఎదురుచూస్తున్నాం" అన్నాడు సంత్ కుమార్.

"నేను మహదానందంగా అనుమతిస్తున్నాను, నేను మిమ్మల్ని ఆశీర్వదిస్తున్నాను."

ఆయన గిరిధరదాస్‌తో జరిగిన మాటలన్నీ వివరించాడు.

"తమ ఆశీర్వాదం వుంటే మనం జయించామన్నమాటే. ఆయన తన డబ్బు చూసుకుని గర్వపడుతున్నట్లున్నాడు. కాని మనమూ ఏమీ గాజులు తొడుక్కు కూర్చోలేదు!" నాసికా పుటా లుబ్బించి అన్నాడు సిన్హా.

భవన నిర్మాణం సగంవరకై పోయినంత సంతోషంగా ఉన్నాడు సంత్ కుమార్. "మీరు బాగా తగిన జవాబిచ్చారు" అన్నాడు.

"ఇటువంటి లక్షాధికారులను తైతెక్కలాడిస్తున్నాం మనం" బిగించిన డోలుమీద దెబ్బకొట్టినట్లన్నాడు సిన్హా.

"మనిద్దరి బంగళాలూ యిక్కడే వేయిద్దాం మిత్రమా." సంత్ కుమార్ కలలు గనటం మొదలెట్టాడు.

"ఇక్కడెందుకూ? సివిల్ లైన్సులో వేయిద్దాం!" అన్నాడు సిన్హా.

"షుమారు ఎన్నాళ్ళకు వస్తుంది తీర్పు?"

"ఆరు నెలల లోపు."

"నాన్నగారి పేర సరస్వతీ మందిరం కట్టించుదాం."

కాని దావాకు డబ్బెలాగనేది సమస్య. దేవకుమార్ ఆశలేని వ్యక్తి. ధనాన్ని ఆయ నెప్పుడూ ఉపాసించలేదు. కూడ

పెట్టటానికి తగినంత అధికమైనధనం ఆయన కెప్పుడూ లభించనే లేదు. ఏ నెలలోనన్నా ఏభై రూపాయలు మిగిలినా మరో నెలలో ఖర్చయిపోయేవి. తన పుస్తకా లన్నిటికీ కాపీరైటు విక్రయిస్తే ఆయనకు లభించింది అయిదు వేలరూపాయలు. ఆ పైకం ఆయన పంకజ వివాహం నిమిత్తం అట్టిపెట్టాడు. ఇప్పు డిక ఏ విధంగానూ పెద్దగా ధనం లభించే లక్షణా లేమీ కన బడటంలేదు. సంత్‌కుమార్ యింటిఖర్చులు గడుపుతాడనీ, తా నిక కొన్నాళ్ళు విశ్రాంతిగా కూర్చోటానికో, స్వేచ్ఛగా సంచారం చేయటానికో అవకాశం లభిస్తుం దనుకున్నాడు, దేవ కుమార్. కాని యింత పెద్ద ప్లాను వేసుకున్నతర్వాత, ఆయ నిక విశ్రాంతిగా ఎలా వుండగలుగుతాడు ? ఆయన భక్తుల జనాభా తగినంత పెద్దదే. ఆయన భక్తబృందంలో యిద్దరు మహారాజాలు కూడా వున్నారు; దేవకుమార్ తమ యింటికి వచ్చి ఆయన పాదపద్మాలతో తమ గృహాలు పవిత్రం చెయ్యాలనీ, తమ భక్తిశ్రద్ధలను వారి పాదాలముందు సమర్పించుకోవాలనీ ఎంతో కాలంనుండీ వారి అభిలాష. కాని ఎప్పుడూ ఏ ఆస్థానంలోనూ అడుగుపెట్టని వ్యక్తి దేవకుమార్. అటువంటివా డెప్పుడూ తన అభిమానులతోనూ, భక్తులతోనూ తన ఆర్థికస్థితికి సంబంధించిన గోడును వెళ్ళబోసుకోటం మొదలెట్టాడు. నోరు తెరచి సహాయం చెయ్యమని యాచిస్తున్నాడు. ఆయన ఆత్మగౌరవం ఏ సమాధిలోనో నిద్రపోయినట్లుగా వుంది.

మరి త్వరలోనే దాని ఫలితం గోచరమయింది. దేవ కుమార్ డెబ్బయ్యవ జన్మదినోత్సవం బ్రహ్మాండంగా జరపాలనీ, ఆ సందర్భంలో ఆయనకు సాహిత్యాభిమానుల తరఫున ఒక

'పర్సు' బహూకరిస్తే బాగుంటుందనీ ఒక భక్తుడు ప్రతిపాదించాడు. తన జీవితంలో నలభై సంవత్సరాలు సాహిత్యసేవకు అంకితంచేసిన మహారథు డాయన. అలాంటి వాని కీ వృద్ధాప్యంలోకూడా ఆర్థికబాధలనుండి విముక్తి కలుగకపోవటం విచారకరమైన, లజ్జాకరమైన విషయం కాదూ ? సాహిత్య వికాసం మాటలతో జరుగుతుందా ? మనం మన సాహిత్య నిర్మాతలను సరిగా సత్కరించటం నేర్చుకోనంతవరకూ సాహిత్యానికి ఔన్నత్యం సమకూరదు. ఈ విషయాన్ని వార్తా పత్రికలు ముక్తకంఠంతో సమర్థించాయి; ఆశ్చర్యకరమైన విషయమేమంటే దేవకుమార్‌తో చాలాకాలంనుండీ సాహిత్య స్పర్థగల మహానుభావులుగూడా ఈ సందర్భంలో తమ ఉదారతను ప్రదర్శించారు. విషయం బాగా వ్యాప్తమయింది. ఒక కమిటీ ఏర్పడింది. ఒక మహారాజా దానికి అధ్యక్షుడు. మిస్టర్ సిన్హా ఎన్నడూ దేవకుమార్ పుస్తకం ఒక్కటిగూడా చదివినవాడు కాడు. కాని ఈ ఉద్యమంలో ప్రముఖపాత్ర వహిస్తున్నాడు. స్త్రీలు పురుషులకంటె వెనుకబడియుంటే ఎలా మరీ ? మిస్ కామత్, మిస్ మలిక్ లు గూడా ఈఉద్యమాన్ని బలపరుస్తున్నారు. జ్యేష్ఠమాసంలో ముహూర్తం నిశ్చయమైంది. నగరంలోని ఇంటర్‌మీడియట్ కాలేజీలో ఈ ఉత్సవానికి సన్నాహాలు జరుగుతున్నాయి.

చివరికారోజు వచ్చేసింది. నాటి సాయంత్రమే ఉత్సవం. దూర దూరాలనుండీ విచ్చేశారు సాహిత్యాభిమానులు. సారావ్ సంస్థాన యువరాజుగారు పర్సు బహూకరిస్తారు. "ఉపన్యాసా లుంటాయి. గానకచ్చేరీ లుంటాయి. నాటకం

ప్రదర్శిస్తారు. విందు జరుగుతుంది. కవిసమ్మేళనం జరుగుతుంది" ఈ రకమైన ప్రకటనలు నగరపు గోడ లన్నిటిమీదా అంటిం చారు. నాగరిక సమాజంలో మంచి సంచలనం వ్యాపించింది. రాజుగారు సభాధ్యక్షులు.

దేవకుమార్‌కు తాను ప్రదర్శన వస్తువుగా తయారవట మంటే చెడ్డఅసహ్యం. బహిరంగసభలకు కూడా తరచు వెళ్ళే వాడుకాదు. కాని ఈరోజు క్రొత్తపెళ్ళికొడుకుగా తయా రవక తప్పలేదు. సభకు వెళ్ళేసమయం సమీపిస్తున్నకొద్దీ, ఆయన మనస్సులో ఒకవిధమైన విషాదం అలముకొంటోంది: ఆ 'పర్సు' బహూకరించే సమయంలో, ఆయన చేయి జాచి అందుకోబోయే ఆ దృశ్యం, ఎంత లజ్జాకరంగా ఉంటుంది! డబ్బుకోసం ఎన్నడూ చేయి జాచని వ్యక్తి ఈ చివరి రోజుల్లో యితరులనుండి దానంపొందటమా? 'దీన్ని దానమనే అనాలి. మరేమీ కాదు.' ఒక్కనిమిషం ఆయన ఆత్మగౌరవం తిరుగుబాటు చేసింది. ఈ సందర్భంలో తాను 'పర్సు' స్వీక రించినదే తడవుగా, అక్కడి కక్కడే ఏ ప్రజాసంస్థకో దాన్ని యిచ్చివేయటమే ఆయనకు శోభ చేకూరుస్తుంది. ఆయన జీవితాదర్శాలకు ఆపనే యోగ్యమైంది. అందులోనే ఉంది ఆయన గొప్పతనం. ఆయన మహాసభ పందిరిలోకి వచ్చినప్పుడు ముఖంలో ఉత్సాహరేఖలు లేవు. ఆయన కొంచెం సిగ్గు పడుతున్నట్లు తోచింది. కీర్తికాంక్ష ఒకవైపుకూ, ఆశ మరొక వైపుకూ లాగుతున్నాయి. ఈ దానం దానంకాదనీ, హక్కనీ మనసు కెలా నచ్చచెప్పటం? చివరకు డబ్బుకోసం ఎగబడ్డాడని ప్రజలు పరిహాసిస్తారు. ఆయన జీవితం బుద్ధిబలంమీద ఆధార

పడింది. మరి బుద్ధి తాను చేసే ప్రతిపనినీ "నీతి" అనే గీటు రాయితో తరిచి మరీచేస్తుంది. నీతియొక్క ఆసరా లభిస్తే చాలు. ఇక బుద్ధి ప్రపంచాన్నే లక్ష్యపెట్టదు. దేవకుమార్ ప్రవేశించగానే ఘనంగా స్వాగతమిచ్చారు. మంగళగీతాలు గానంచేశారు. ఆయన కీర్తిని శ్లాఘిస్తూ వుపన్యాసాలు సాగుతున్నాయి. కాని తలనొప్పితో బాధపడుతున్న వ్యక్తిలాగా ఉన్నారు దేవకుమార్. ఇప్పుడాయనకు ఆ బాధ ఔషధం కావాలి. ఆయన కేమీ బాగుండలేదక్కడ. అందరూ పండితులే; కాని వారి భావాలెంత సారహీనమైనవి! ఆడంబరమైనవి! వారిలో ఎవరూ ఆయన సందేశాలను అర్థం చేసుకున్నట్టు లేదు. ఈ ప్రశంసలూ, కీర్తిగానాలూ, గ్రుడ్డి భక్తిగాని మరేమీ కాదు. ఆయనను ఎవరూ అర్థంచేసుకోలేదు. నలభై సంవత్సరాలకాలం తనను అదుపులో ఉంచగలిగిన శక్తి ఏది? ఎన్నడూ క్షీణించకుండా ప్రకాశించిన ఆ జ్యోతి ఏది?

తటాలున ఆయన కొక ఆధారం లభించింది. ఆయన ఆలోచనావంతమైన పచ్చని వదనంలో ఒక సన్నని మందహాసం వికసించింది. ఇది దానం కాదు. అంతవరకూ తన ఆదాయంలో మినహాయించుకుంటూ వచ్చిన ప్రావిడెంటుఫండిది. ప్రభుత్వ ఉద్యోగాల్లో ప్రజలు పెన్షను పుచ్చుకుంటున్నారు. అది దానమౌతుందా? ఆయన ప్రజలకు సేవ చేశాడు; సర్వస్వం పరిత్యజించేశాడు. పెద్ద పెద్ద జీతాలిచ్చినా ఏర్పడని తదేక నిష్ఠతో చేశాడు. పెన్షను పుచ్చుకోటానికి సిగ్గుపడటమెందుకూ?

మహారాజాగారు 'పర్సు'లు బహూకరించగానే దేవకుమార్ వదనంలో గర్వం, హర్షం, విజయం చిందులాడినాయ్.

## నవలలు

| | | |
|---|---|---|
| బృందావనం | జె. వి. చెన్నారెడ్డి | రు. 1.25 |
| గాడిద ఆత్మకథ | కిషన్‌చందర్ | 1.50 |
| మృతజీవులు | గోగోల్ | 6.00 |
| బాల్యం, యౌవనం, కౌమారం | టాల్‌స్టాయ్ | 6.00 |
| సింహసేనాపతి | రాహుల్ సాంకృత్యాయన్ | 3.50 |

## జీవిత చరిత్రలు

| | | |
|---|---|---|
| గదర్ వీరులు | దర్శి చెంచయ్య | 0.62 |
| భగత్‌సింగ్ మిత్రులు | అజయ్ ఘోష్ | 0.75 |

## సిద్ధాంతం, రాజకీయం

| | | |
|---|---|---|
| జ్ఞాన సిద్ధాంతం | మారిస్ కార్న్‌ఫోర్త్ | 3.75 |
| కామన్వెల్త్ సమస్యలు | పామీదత్ | 0.25 |
| నవ ఆఫ్రికా | ఎ. వి. కె. ప్రసాద్ | 0.75 |
| ధరల స్థిరీకరణ | వి. పట్టాభిరామారావు | 0.40 |
| భారతదేశానికి సోషలిస్టుదేశాల సహాయం | .. | 0.37 |
| కష్టుడు (బుర్రకథ) | సుందర | 0.37 |
| నిజరూపాలు (మూకనాటిక) | రావు | 0.20 |

ప్రతులకు:

# విశాలాంధ్ర ప్రచురణాలయం,

బకింగ్‌హాంపేట (పోస్టు) — విజయవాడ

Swatantra Art Printers, Vijayawada-2.